# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద

గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మహిళలపై దౌర్జన్యం




-: రచన :-

మల్లాది సుబ్బమ్మ





మల్లాది పబ్లికేషన్స్

9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ, మెహదీపట్నం

హైదరాబాద్ - 500 028

# ఆడవారిపై హింస
# ఏ ధర్మశాస్త్రం హర్షిస్తుంది ?

అసలు పెళ్ళి అంటే అది అమ్మాయి మరణానికి సోపానమవుతోంది. లేదా సుఖసంతోషాలకు, శాంతికి దూరమవుతోంది. పెళ్ళిలోనే ఆమె కోర్కెలు, హక్కులు సంతోషం అన్నీ సర్వనాశనమయి పోతున్నాయి. ఆడవారు తమ సమస్యలను కష్టాలను బహిర్గతం చెయ్యరు. కనుక ఈ దారుణాలు సభ్యసమాజానికి తెలియటం లేదు. మేడిపండు చూడ మేలిమైయుండు, పొట్టవిప్పి చూడ పురుగులుండు అన్నట్లు ఆమె జీవితం అన్యాయానికి, అక్రమానికి, అణచివేతకు లొంగిపోతోంది. ఆమెపై రకరకాలయిన అత్యాచారాలు అత్యధిక స్థాయిలో జరుగుతున్నాయి కనుక వాటి స్వరూపభావాలు తెలిసికొందాం.

కేవలం శారీరక హింస, మానసిక హింస, శారీరక, మానసిక హింసల సమ్మిళితం అనేవి మూడురకాలయిన హింసలు స్త్రీలపై జరుగుతున్నాయి. దెబ్బలు వాతలు శరీరక హింస క్రిందికి వస్తాయి. మిగతా రెంటిలో మానసిక హింస ప్రధాన పాత్ర వహిస్తుంది. మాటలద్వారా, తిట్లద్వారా, తిరస్కారాలద్వారా హావ భావాల ద్వారా న్యూనత పరిచే విధానాలు మానసిక హింసకు ప్రతీకలు. కొట్టటం, లైంగికంగా వేధించటం, మానభంగం, సజీవదహనం ఇవి మూడో రకానికి చెందినవి. వీటిలో శారీరక మానసిక హింసలు రెండూ చోటుచేసుకుంటాయి.

వీటికి లోనుఅయిన స్త్రీ పరిస్థితిని గమనిద్దాం. తనను బాధించే పురుషుని దృష్టిలో తను కేవలం వస్తువునని, లేక బానిసనని, లేక రెండవరకపు మనిషినని ఆమె తలపోస్తుంది; అంతేగాక అతని కాముకతను తీర్చే లైంగికాకర్షణ కల్గిన జీవిగా అతడు తనను పరిగణిస్తున్నాడని భావిస్తుంది. ఈ స్పృహ ఆమెలో రెండురకాల స్పందనను కలుగజేయవచ్చు. తను నిజంగా తక్కువ మనిషినని తలంచి ఆత్మ న్యూనతాభావానికి లొంగిపోవడం ఒకటి. అలాకాక వ్యతిరేకించడానికి సిద్ధమవటం రెండవది. వ్యతిరేకించడం పలు విధాలుగా సాగించవచ్చు. 1) బాధించే పురుషుని చైతన్యయుతంగా ఎదుర్కొనటం 2) అతని జీవితం నుండి తను వైదొలగిపోవటం రెండవ పద్ధతిలో మరల రెండు విధానాలు ఉన్నాయి. 1) బాధించే పురుషుడు భర్త అయిన పక్షంలో అతని నుండి విడాకులు పొంది లేక కోర్టు ద్వారా వేర్పాటు ఉత్తర్వును పొంది లేక పొందకనో విడిగా జీవించడం. 2) ప్రాణత్యాగం చేయటం.

ఆత్మ న్యూనతాభావానికి లొంగిపోయిన మహిళ రెండు రకాలుగా ప్రవర్తించడం చూస్తున్నాం. 1) భర్తకు లేక అత్యాచారం చేసిన పురుషునికి లొంగి పడి ఉండటం. 2) తనపై జరిగిన అత్యాచారం వలన తను ఏదో మలినమయినట్లు, చెడిపోయినట్లు భావించుకొని తనప్రాణాన్ని తీసుకొని తన జీవితాన్ని తన చేజేతుల నాశనం చేసుకోవడం మనం చూస్తున్నాం.

ఈ అత్యాచారాలను పురుషపరంగా పరిశీలిస్తే కొన్ని వింత విశేషాలు తెలియవస్తాయి. ఈ అత్యాచారాలను చేస్తున్న పురుషుల మానసిక స్థితి ఎలాంటిది? వారి ఉద్దేశ్యం ఏమిటి? వారు ఆశించేది ఏమిటి? వీరిలో చాలమంది మానసిక వ్యాధి గ్రస్తులు. పరపీడనవల్ల ఆత్మానందాన్ని పొందుతామని భ్రమసి సంచరించే మనుషులు. అవతలి వ్యక్తి ఎంతగా బాధపడుతుంటే, ఎంతగా వ్యధ చెందుతుంటే అంతగా సంతోషిస్తారు. దీనిని "సాడిజం" అంటారు. మరొక రకం పురుషులకు స్త్రీ జాతిపై ద్వేషము, పగ ఉంటాయి. వారి జీవితంలో వారు ఎవరో స్త్రీచేత అవమానింపబడి ఉంటారు. ఆ కసిని ఇలా ఇతరులపై తీర్చుకుంటారు. ఇంకా కొందరికి పురుషాధిక్యతా భావాలు ఉంటాయి. అందుచేత స్త్రీని లొంగతీసుకోవాలనే తలంపుతో హింసకు పూనుకుంటారు. మరొకరకం పురుషులకు ఇది ఒక ఆట; ఒక తమాషా. ఇతరులను అల్లరి చేయడం సరదా. వారు సామాజిక బాధ్యత అంటే ఏమిటో తెలియనివారు. మరి వారు బాధకు గురిచేయటానికి స్త్రీలనే ఎందుకు ఎన్నుకుంటారు? సంప్రదాయసిద్ధంగా స్త్రీలు తాము అబలలమనే భావంతో ఎదురుతిరగరు కనుక ఎదురుదెబ్బ ప్రమాదం ఉండదు. అందుకే వారు స్త్రీలను తమ దుర్మార్గాలకు లక్ష్యాలుగా ఎంపిక చేస్తారు.

ఇక స్త్రీలలో కూడ కొంతమంది విపరీత మనస్కులు లేకపోలేదు. వారికి హింసింపబడటం ఆనందదాయకం. ఇది ఒక మానసిక వ్యాధి. దీనిని "మెసోకిజం" అంటారు. ఏనాడు భర్తచేత లేక మిండగానిచేత ఆమె తన్నులు తినదో ఆనాడు ఆమెకు సుఖం లేదు; ఆనందంలేదు. ఇలాంటి సంఘటనలను మనం ఎన్నో చూస్తున్నాం. ఇలాంటి కథలు ఎన్నో విన్నాం. ఎక్కువమంది స్త్రీలు హింసను ఆహ్వానించరు, సహించరు కుమిలి కుమిలి క్రుంగిపోతారు. కొద్దిమంది మాత్రం ఎదురు తిరుగుతారు ఇంకా స్త్రీలపై హింస అనేక విధాలు. 1) భార్యలపై హింస, 2) లైంగిక వేధింపు, 3) మానభంగాలు, 4) అశ్లీల సాహిత్యప్రచారం వున్నాయి కనుక సమస్యను ప్రజాదృష్టికి తేవాల్సిన అవసరం చాలా వుంది.

—మల్లాది సుబ్బమ్మ

# విషయసూచిక

# భార్యలను తగలెయ్యటం

ఇటీవల భార్యలను తగలెయ్యటం ఎక్కువయింది. అలాగే స్త్రీల వేధింపు కేసులు పెరుగుతున్నాయి. వార్తా పత్రికలలో ప్రకటన రాగానే చదివిన స్త్రీ పురుషులు "అన్యాయం, అక్రమం, ఘోరం, ఇలా అయిపోయిందే సమాజం" అని హాహాకారాలు చేస్తారు. అంతే, అంతటితో ఆగిపోతున్నది సమాజపు ఉలికిపాటు. కొన్ని సందర్భాలలో పోలీసులు నిందితులపై కేసులు పెడ్తారు. వాటిలో ఎక్కువ సంఖ్యలో నిందితులు శిక్షను తప్పించుకుంటున్నారు. నిజాయితీగల పోలీసు అధికారులు విలవిలలాడిపోతారు వీటిని చూచి. అవినీతిపరులయిన పోలీసు అధికారులు సొమ్ము చేసుకోగలిగామని సంతోషిస్తున్నారు. చప్పరించి ఊరుకుంటారు పత్రికల చదువరులు. ఈ సమస్యలను లోతుగా ఆలోచించగల స్త్రీ పురుషులు కరువవుతున్నారు.

పేరు ప్రఖ్యాతులున్న మహిళలు సైతం సమాజాన్ని ఆవరించిన జాడ్యాలను గురించి ప్రసగించటం లేదు. వారు మాట్లాడకపోగా వీటి విషయమై ఆందోళన చేసే వారిని ఎగతాళి చేయటం కద్దు. "మావారు నన్ను బాగా చూస్తారు. నా అత్తమామలు నన్ను బాధించరు" అని చెపుతూ ఉంటారు. విడిగా వ్యక్తిగత సంభాషణలలో అలా మాట్లాడటమే కాదు, సభలలో మహాసభలలో ఇదే వరసలో గంభీరోపన్యాసాలు చేస్తారు, చేస్తున్నారు. సమాజంలో నెలకొని యున్న పితృస్వామ్య వ్యవస్థ (Patriarchy) విలువలను పరికించ నిరాకరిస్తారు. పురుష ప్రాధాన్య సమాజపు విలువలను తెగనాడే వారిపట్ల అంటే వారి భావాలపట్ల— గౌరవభావం పెరగకుండా పరోక్షంగా జాగ్రత్తపడటం జరుగుతున్నది. ఇదీ ప్రమాదభరితమే.

ఈ మధ్య విద్యావంతులయిన స్త్రీలలో ఒక "సెక్షను"లో మరో ధోరణి వస్తున్నది. పురుషులు అంటే భర్త, కుమారుడు, తండ్రి వీరిలో ఏ ఒకరి వల్లనో బాధలకు గురి అయినవారే ఆ స్త్రీలు. భర్త త్రాగుబోతయి ఆమెను హింసించటం కొట్టడం, మరో స్త్రీతో అక్రమసంబంధం పెట్టుకోవటం, ఆమెను పోషించక వదలివేయడం ఇలాంటి బాధలకు బలిఅయిన వారే ఆ తరగతి స్త్రీలు. వారు ఎంతగా బాధలకు గురి అయితే అంతగా వారు పాతివ్రత్య ధర్మాలను గురించి సభలలో, రేడియోలో, టి విలో ఉపన్యాసాలిస్తారు, ఇస్తున్నారు. కనీసం మనిషికి ఉండవలసిన ఆత్మగౌరవాన్ని వారు ప్రదర్శించటం లేదు, స్త్రీ జాతికి జరుగుతున్న అన్యాయాన్ని సహితం వారు నిరసించటంలేదు. ఈ రకపు స్త్రీల ప్రవర్తన చాల విడ్డూరంగా

కనిపిస్తుంది. కాని నిజానికి అది విచిత్రం కాదు. వారిలో మానసిక సంఘర్షణ సాగుతున్నది. భర్త దుష్ప్రవర్తనకు తామే కారకులమని వారు భావించటం, ఆత్మ న్యూనతా భావాన్ని అలవర్చుకోవడం, దోషభావంతో కుమిలిపోవటం, చివరకు పురుష ప్రాధాన్య సమాజపు విలువలను తమకు తెలియకుండానే వారు పుణికి పుచ్చుకొని వాటిని తమ స్వంతం చేసుకోవడం ద్యోతకమవుతున్నది.

**ఈ అన్యాయపు నైజం ఏమిటి ?**

భార్యలను తగలెయ్యటం అనేది చంపటం అనే ప్రక్రియలో ఒక రీతి. భార్యను చంపడం అనేది మౌలిక జాతికి చెందిన నేరం. భార్యను చంపడం అనేది అనేక రకాలుగా జరుగుతున్నది.

1) భార్యను నరికి చంపడం లేక కత్తితో పొడవడం

2) భార్యను గొంతు నులిమి చంపడం లేక ఉరితీయటం

3) ఆమెను హింసించి, చిత్రహింసల పాల్జేసి ఆమె ఆత్మహత్య చేసుకునే లాగు ప్రవర్తించటం

4) భార్యను సజీవ దహనం చేయటం (కిరసనాయిపోసి నిప్పుముట్టించటం)

5) భార్యను(విధవ/కాగానే) సతీ సహగమనం పేరుతో భర్త శవం ప్రక్కన పరుండబెట్టి ఆమె బతికిఉండగానే ఆమెను తగలెయ్యటం. భార్యను హింసించటం (cruelty)(కొట్టటం, క్రూరంగా బాధపెట్టటం), మానసికంగా ఆమెను చిత్రవధ చెయ్యటం(Mental cruelty), చిత్రహింస చేయటం(Torture) వీటి పరాకాష్టయే భార్యను చంపడం. ఈ అక్రమాలు పరిమాణాత్మకంగా పెరిగి గుణాత్మకంగా మారి చివరకు ఆమెను అంతం చేయడంతో పూర్తి అవుతాయి. ఈ క్రమాన్ని, ఈ క్రమపు దశల అవినాభావ సంబంధాన్ని గుర్తించలేని వారు "భార్యను చంపడం" అనేది హఠాత్తుగా జరిగిన సంఘటన అని భావిస్తారు, దిగ్భ్రాంతికి, తాత్కాలికంగా లోనవుతారు. తరువాత అంతా మరచిపోతారు.

స్త్రీల వేధింపు రెండు రకాలుగా ఉంటున్నది. 1) ఎగతాళి, అపహాస్యం మోతాదును మించి పెచ్చు పెరగడం 2) లైంగిక వేధింపు.

**భార్యను చంపడం, స్త్రీలను వేధించడం :** ఈ నేరాల వెనుకనున్న పురుష ప్రాధాన్య సమాజపు విలువలు ఒకే రకమైనవి. ఈ అంశాన్ని గురించి మరో పుస్తకంలో విశదంగా వివరించటం జరిగింది, మౌలిక కారణం ఒకటే ఒకటి. **పురుషుడు తను అధికుడనని అనుకోవడం, పురుషులకన్నా తక్కువ తరగతికి చెందిన స్త్రీజాతి మనిషిగా భార్యను భావించటం ఈ అనర్థాలకు కారణం.**

కనిపిస్తుంది. కాని నిజానికి అది విచిత్రం కాదు. వారిలో మానసిక సంఘర్షణ సాగుతున్నది. భర్త దుష్ప్రవర్తనకు తామే కారకులమని వారు భావించటం, ఆత్మ న్యూనతా భావాన్ని అలవర్చుకోవడం, దోషభావంతో కుమిలిపోవటం, చివరకు పురుష ప్రాధాన్య సమాజపు విలువలను తమకు తెలియకుండానే వారు పుణికి పుచ్చుకొని వాటిని తమ స్వంతం చేసుకోవడం ద్యోతకమవుతున్నది.

**ఈ అన్యాయపు నైజం ఏమిటి ?**

భార్యలను తగలెయ్యటం అనేది చంపటం అనే ప్రక్రియలో ఒక రీతి. భార్యను చంపడం అనేది మౌలిక జాతికి చెందిన నేరం. భార్యను చంపడం అనేది అనేక రకాలుగా జరుగుతున్నది.

1) భార్యను నరికి చంపడం లేక కత్తితో పొడవడం

2) భార్యను గొంతు నులిమి చంపడం లేక ఉరితీయటం

3) ఆమెను హింసించి, చిత్రహింసల పాల్జేసి ఆమె ఆత్మహత్య చేసుకునే లాగు ప్రవర్తించటం

4) భార్యను సజీవ దహనం చేయటం (కిరసనాయిపోసి నిప్పుముట్టించటం)

5) భార్యను(విధవ/కాగానే) సతీ సహగమనం పేరుతో భర్త శవంప్రక్కన పరుండబెట్టి ఆమె బ్రతికిఉండగానే ఆమెను తగలెయ్యటం. భార్యను హింసించటం (cruelty)(కొట్టటం, క్రూరంగా బాధపెట్టటం), మానసికంగా ఆమెను చిత్రవధ చెయ్యటం(Mental cruelty), చిత్రహింస చేయటం(Torture) వీటి పరాకాష్టయే భార్యను చంపడం. ఈ అక్రమాలు పరిమాణాత్మకంగా పెరిగి గుణాత్మకంగా మారి చివరకు ఆమెను అంతం చేయడంతొ పూర్తి అవుతాయి. ఈ క్రమాన్ని, ఈ క్రమపు దశల అవినాభావ సంబంధాన్ని గుర్తించలేని వారు "భార్యను చంపడం" అనేది హఠాత్తుగా జరిగిన సంఘటన అని భావిస్తారు, దిగ్భ్రాంతికి, తాత్కాలికంగా లోనవుతారు. తరువాత అంతా మరచిపోతారు.

స్త్రీల వేధింపు రెండు రకాలుగా ఉంటున్నది. 1) ఎగతాళి, అపహాస్యం మోతాదును మించి పెచ్చు పెరగడం 2) లైంగిక వేధింపు.

భార్యను చంపడం, స్త్రీలను వేధించడం : ఈ నేరాల వెనుకనున్న పురుష ప్రాధాన్య సమాజపు విలువలు ఒకే రకమైనవి. ఈ అంశాన్ని గురించి మరో పుస్తకంలో విశదంగా వివరించటం జరిగింది, మౌలిక కారణం ఒకటే ఒకటి. **పురుషుడు తను అధికుడనని అనుకోవడం, పురుషులకన్నా తక్కువ తరగతికి చెందిన స్త్రీజాతి మనిషిగా భార్యను భావించటం ఈ అనర్థాలకు కారణం.**

**నిమిత్త కారణాలు**

మౌలిక కారణం ఒకటే అయినా భార్య మీద విసుగు, చికాకు, కోపం, ద్వేషం అనేక రూపాలలో ప్రదర్శితమవుతుంది. అది వివిధ సంఘటనల రూపంగా దర్శనం ఇస్తుంది. ఆ సంఘటనల్లో చివరి నేరానికి దోహదకారులుగా పరిణమిస్తాయి. ప్రతి సంఘటన వెనుక ఒక కారణం ఉంటుంది. చివరి నేరం యొక్క కారణాన్ని నిమిత్త కారణం అంటాం.

**పురుషునికి చికాకు కల్గించే అంశాలు : అతని దుర్మార్గానికి కారణాలు**

1) తన పెత్తనాన్ని మాటలలోగాని, చేతలలోగాని, మౌనప్రదర్శన ద్వారా గాని భార్య నిరసించటం.

2) ఆమె సంపాదనను స్త్రీ తన భర్తకు లేక ఆమె అత్తమామలకు ఇవ్వక ఆమె – అంతకాని, కొంతగాని తానుగా దాచుకోవటం.

3) ఆమె నంపాదనా పరులు కాకపోతే భర్త తన చేతికి యిచ్చిన పైకాన్ని ఇంటి ఖర్చుకు – ప్రతి పద్దూ లెక్కచెప్పటానికి ఆమెఇష్టపడకపోవడం.

4) అతని దురలవాట్లను అంటే పేకాట, బ్రాకెట్టు ఆడటం, త్రాగుడు, మాదకద్రవ్యాలను పుచ్చుకోవడం, వ్యభిచరించడం వీటిని ఆమె విమర్శించడం. అలాగే ఆ సందర్భాలలో తన స్నేహితులను ఇంటికి తెస్తే భార్య వారికి ఆహారాన్ని, ఉపాహారాన్ని, అల్పాహారాన్ని సమకూర్చటానికి నిరాకరించటం కూడా కోప కారణం అవుతున్నది.

5) ఇంటి పోషణ బాధ్యతను, పిల్లలను విద్యాబుద్ధితో నేర్పే విధిని అతడు నిరాదరణ చేస్తే ఆమె అతనిని ఆ అంశాల పరంగా ప్రార్థించడం, హెచ్చరించడం

6) తన అనుమతి లేకుండా భార్య పుట్టింటికి పోయి రావడం. ఇరుగు పొరుగు ఇండ్లకు పోవటానికి కూడ ఆమెకు అతని అనుమతి కావాలి. అంటే ఆమె ఇంటిలో ఖైదీగా ఉండాలన్నమాట. అలా చేయకపోతే ఆమె మీద భర్త ధిక్కార నేరం మోపుతాడు.

7) అతనికి లైంగిక కోరిక కలిగినపుడు ఆమెకు అనారోగ్యంగా ఉండియో లేక ఆమెకు ఉత్సాహం లేకనో, అతడు త్రాగి తూలుతూ వస్తే అసహ్యం వల్లనో ఆమె అతని లైంగిక సాన్నిహిత్యాన్ని కాదంటే అతనికి ఎక్కడలేని కోపం వస్తుంది. అతని కోరికను ఆమె తనకు ఇష్టమున్నా లేకున్నా తీర్చాలి. అదీ అతని దృష్టితో ఆమె పాతివ్రత్యవిధి. అతని దృష్టిలో ఆమె వ్యక్తికాదు. ఆమెకు వేరే

కోరికలు, ఇష్టాయిష్టాలు ఉండరాదు. ఆమె అతని చేతిలో మరబొమ్మ అని అతని ఉద్దేశ్యం.

8) భర్త ఎంత సాధువుగా కన్పించినా, భార్యాభర్తల లైంగిక సంపర్క సందర్భంగా అతనికి పరిజ్ఞానం లేకపోవటం, కేవలం తన తృప్తి, తన సంతోషం మాత్రమే ధ్యేయంగా అతడు సంభావించి ఆమెతో దురుసుగా, హడావుడిగా ప్రవర్తించటంవల్ల ఆమెకు అశాంతి, వ్యధ ఏర్పడితే అతడు చీదరించుకోవటం పరిపాటి

9) తన లైంగిక అసమర్థతను గుర్తించక ఆమెను నిందించి ఆమెపై ద్వేషం పెంచుకోవటం.

10) ఆమెకు సంతానం కలుగకపోతే ఆమెను గొడ్రాలుగా పేర్కొని తిట్టి కొట్టటం. తనవైపున లోపం ఉన్నదేమో తెలుసుకోవటానికి వైద్యునివద్దకుపోకుండా ఆమెను సూటిపోటి మాటలతో బాధించటం.

11) ఆడపిల్లలుగాని, మగపిల్లలు కాని భార్యాభర్తలకు కలుగటానికి భార్యదే బాధ్యత అని పొరపాటుగా భావించి (నిజానికి ఆమెకే బాధ్యతలేదు. లోపంఅయినా కాకపోయినా పురుషునిదే బాధ్యత) ఆమెను ఆడిపోసుకోవటం.

12) వివాహం కేవలం సంతానప్రాప్తికోసమే అని తలపోస్తూ (స్నేహం, సాంగత్యం, జీవిత భాగస్వామ్యం, లైంగిక సాన్నిహిత్యం నిజానికి దాంపత్య జీవితాశయాలు) వాస్తవంగా ఆమె శరీర నిర్మాణ లోపంవల్ల పిల్లలు కలుగకపోతే, విడాకులిమ్మని ఆమెను కోరితే, ఆమె నిరాకరిస్తే ఆమెను వదిలించుకోవాలని అనుకోవటం.

13) భార్య వ్యభిచరించినా, లేక వ్యభిచరిస్తున్నదని అతడు భావించినా, అతడు ఆమెను వదిలించుకోటానికి ప్రయత్నించక, ఆమెను నరికి ముక్కలు చేసి తన పురుషాధిక్యతను, యాజమాన్య వైఖరిని, ప్రదర్శించటం

14) భర్త మరియొక స్త్రీని పెండ్లాడ తలిస్తే పరస్పర సమ్మతితో విడాకులు ఇవ్వటానికి భార్య నిరాకరిస్తే ఆమెను వదిలించుకోటానికి ఆమెను చంపబూనడం జరుగుతున్నది. ఇలా ఎన్నో కారణాలు.

15) ఇస్తామన్న కట్నం పూర్తిగా ఇవ్వలేదని, ఇచ్చినా ఇంకా అదనంగా ఇవ్వలేదని, ఇచ్చినా బాకీ పడ్డారని, అనుకున్నవి ఇచ్చినా ఇంకా మరెన్నో కావాలని అడిగితే ఇవ్వలేదని ఇలా అనేక కారణాలవల్ల భార్యపై ద్వేషం పెంచుకొని ఆమెను చంపి వదలించుకో ప్రయత్నించడం.

16) పెళ్ళి సంతలో పురుషులకు గిరాకీ ఉన్నది కనుక భార్యను చంపి, తను మరల పెళ్ళికి సిద్ధమయితే మరింత కట్నం వస్తుందని తలపోయటం.

17) తన జీవితంలో చిన్ననాటి అనుభవాల మూటను భర్త వదలి వేయలేక పోవటం. తన తల్లిమీద భర్తకు గౌరవభావం ఉంటుంది. తన భార్యను తన తల్లితో పోల్చి చూచుకొని ఆమె ఎందుకూ కొరగానిదని నిర్ణయానికి వచ్చి ఆమెను చంపి వదిలించుకోవాలని అనుకోవటం.

18) భర్తలాగానే భార్యకూడ ప్రతి విషయంలోను తన భర్తను తన తండ్రితో తూకంవేసి అతడు ఎందుకూ పనికిరాని వాడని భావించి అతనిని విమర్శించ పూనితే అతనికి దుర్భరంగా తోచి ఆమెను చంపి వదిలించుకో తలచటం.

19) అత్తాకోడళ్ళ తగాదాలలో భర్త తన తల్లి పక్షం వహించి భార్యను చంపటం.

ఇలా ఎన్నో కారణాలను పేర్కొనవచ్చు.

## భార్యాభర్తల మధ్య తగాదా వస్తే ఏం చేయాలి?

తగాదాల పరిష్కారానికి అనేక మార్గాలున్నాయి.

1) ఇరువురూ కూర్చొని మాట్లాడుకోవటం. ఇతరులను ఆ సంభాషణలో జోక్యం కలుగజేసుకోనీయకపోవడం.

2) కుటుంబ సలహా కేంద్ర సహాయాన్ని పొందటం.

3) సామాజికశాస్త్ర, మానసికశాస్త్ర, వైద్యశాస్త్ర నిపుణుల సంప్రతించటం.

4) సంఘసేవకుల సలహాను తీసుకోవడం.

5) ముఖ్యంగా భార్యాభర్తలు తమ అంతరంగాలను శోధించుకుంటూ విమర్శ, ఆత్మవిమర్శ మరల విమర్శ సాగించటం.

6) పరస్పరావగాహనకు కృషి చేయడం.

7) తమ తప్పులను దిద్దుకోవటం, తమ లోపాలను తొలగించుకోవటం పరస్పర ప్రేమాభిమానాలు, శ్రద్ధా గౌరవభావాలు నెలకొల్పుకోటానికి ప్రయత్నించినపుడే భార్యాభర్తలు సుఖపడగల్గుతారు. లేకపోతే కలతలు, తగాదాలు, పోట్లాడుకోవటాలు, తిట్టుకోవడాలు, కొట్లాటలు అన్ని సంభవిస్తాయి. వారిమధ్య హింస చిత్రహింస, క్రూరహింసలు చోటుచేసుకుంటాయి. భార్య చావుకు దారి సుగమమవుతుంది. అతడు ఆమెను చంపి వదిలించుకుంటాడు.

## సంస్కారి అయిన భర్త ఎలా ప్రవర్తించాలి?

భార్య నడత నచ్చని భర్త సంస్కారి అయితే ఆమెను నడత మార్చుకోమని అభ్యర్థిస్తాడు. ఆమె అతని కోరికను మన్నించకపోతే ఆమెకు విడాకులిస్తాడు. పిల్లల శ్రేయస్సు కోసం విడాకులు తీసుకోదలచకపోతే కోర్టుద్వారా ఆమె నుండి విడిపోతాడు. అదీ కుదరకపోతే ఆమెను వదలి వేరుగాపోతాడు. అంతేగాని ఆమెను కొట్టడు, తిట్టడు, హింసించడు, చిత్రహింసల పాలు చేయడు.

ఆమె మనిషి. పశువు కాదు. పశువును కూడా అదిలించవచ్చు కాని క్రూరంగా హింసించరాదు. అలాంటప్పుడు ఆమెను భర్త కొట్టటానికి హక్కు లేదు. "నా పెళ్ళాన్ని నేను కొట్టుకుంటాను, చంపుకుంటాను, నీవు ఎవరివి జోక్యం కలుగ చేసుకోవటానికి" అనే భర్తలున్నారు వారు ఎక్కువగా కాయకష్టం చేసే కుటుంబాలలో దర్శనమిస్తారు. మధ్యతరగతుల వారు అలా అనరు కాని వారి మనస్సులోని మాటలు కూడా అవే అంతే కాదు ఇరుగు పొరుగు వారు, స్నేహితులు బంధువులు ఇలాంటి సందర్భాలలో "భార్యాభర్తలు తిట్టుకుంటారు, కొట్టుకుంటారు, మనకెందుకు?" అనే భావాలను బహిరంగంగా వెలిబుచ్చటం సాగుతున్నది. భర్త భార్యను దండించవచ్చనే అభిప్రాయం సంప్రదాయ వర్గాలలో బాగా వ్రేళ్ళూని ఉంది. అందుకనే ఇలాంటి మాటలు, వ్యాఖ్యలు ఉదయిస్తున్నాయి.

**శిక్షలు :** భర్త అయినా సరే భార్యను కొడితే భారత శిక్షాస్మృతి 323 క్రింద నేరం చేసినట్లు లెక్క. ఒక సంవత్సరం మించని జైలుశిక్ష విధింపవచ్చును కత్తితో గాయం చేస్తే, కాలిస్తే మూడు సంవత్సరాలకు మించని జైలుశిక్ష [324 సెక్షను] ఆమెకు చెయ్యి విరిగినా, పన్ను విరిగినా, ఒక అవయవం దెబ్బతిన్నా లేక 21 రోజులు కాని అంతకు పైనగాని ఆమె ఆస్పత్రిలో పడకలో ఉండవలసి వస్తే నిందితుడయిన భర్తకు ఏడు సంవత్సరాలు నిండని జైలుశిక్ష పడుతుంది. [325 సెక్షన్] ఆమె తన పెండ్లి అయిన ఏడు సంవత్సరములలోగా ఆత్మహత్య చేసుకుంటే, భర్త లేక అతని బంధువులు అంతకు ముందు ఆమెను హింసిస్తే, అతని హింస వలననే ఆమె ఆత్మహత్యకు తలపడిందని కోర్టువారు ప్రథమంగా అభిప్రాయపడతారు. (సెక్షను 113 A భారత సాక్ష్య శాసనం) తను నిందితుడు కాదని భర్త రుజువు చేజువు చేసుకోవాలి. ఆమెను అతడు ఖూనీ చేస్తే అతనిపై హత్యానేరం మోపబడుతుంది(సెక్షను 302). వరకట్న మరణం కలిగించని భర్తకు ఏడు సం॥తగ్గని జైలుశిక్ష(సెక్షను 304 బి). ఆత్మహత్మకు దోహదం చేస్తే

పధి సం॥ మించని శిక్ష (సెక్షను 306). కాగా రెండు సందర్భాలలో కొంత తేడా ఉంటున్నది. ఆమె భర్తతో కాపురం చేస్తుంటే, ఇష్టాయిష్టాల ప్రసక్తి లేకుండా భర్త బలవంతంగా తన భార్య పొందును అనుభవిస్తే ఆమె అతనిపై కేసు పెట్ట టానికి వీలులేదు. పెళ్ళి అనే తంతు జరిగినందున అతడు అలాంటి దుర్మార్గం చేయటానికి ఆమె అతనికి లైసెన్సు ఇచ్చిందట. కాకపోతే భార్య కోర్టు ద్వారా ఉత్తర్వులు పొంది భర్తనుండి విడిగా వుంటే, అతడు ఆమెను మానభంగం చేస్తే, ఆమె ఫిర్యాదు చేసి నేరాన్ని రుజువు చేస్తే అతనికి 2 సం॥ జైలుశిక్ష వరకు వేయవచ్చును(సెక్షను 376–ఎ) అదే అతడు ఇతర స్త్రీపై అదే నేరాన్ని చేస్తే అతనికి ఏడు సం॥ తగ్గకుండా పది సం॥ జైలుశిక్ష(సెక్షన్ 376). 12 సం॥ నిండి 16 సం॥ నిండని భార్యను మానభంగం చేస్తే భర్తకు రెండు సం॥లు మాత్రమే శిక్ష వేయవచ్చును.

ఇంకొక అంశం గమనార్హం. భార్య ఉండగా భర్త ఉంపుడుగత్తెతో సాంగత్యం పెట్టుకుంటే ఆ కారణాన భార్య అతనిపై క్రిమినలు కేసు పెట్టటానికి వీలుండదు. అలాగే భార్య పర పురుషునితో సంబంధం పెట్టుకుంటే అతడు ఆమెపై క్రిమినలు కేసు పెట్టటానికి వీలుండదు. ఈ రెండు సందర్భాలలో జరిగిన అవినీతికర విషయాన్ని గురించి భార్యాభర్తలు ఒక రిపై మరొకరు క్రిమినలు కేసులు పెట్టటానికి వీలులేదు. కాగా ఆ కారణాన వారిలో ఒకరు రెండవ వారిపై సివిలు కోర్టులో అభియోగం తెచ్చి పెళ్ళిని రద్దు జరిపించు కోవచ్చు. అలాకాక భర్త భార్య మిండగానిపై క్రిమినల్ కేసు పెట్టవచ్చును. భార్య భర్త రంకులాడిపై క్రిమినలు కేసు పెట్టటానికి వీలులేదు. ఇది ద్వంద నీతిగా కనిపిస్తున్నది. పురుషునికొక నీతి, స్త్రీలకు మరొక నీతి. అయితే ఇదే అమలులో ఉన్న నీతి.

**మరి ఇలా నేరస్థులైన భర్తలకు శిక్షలు పడులున్నవా ?**

లేదు. కారణాలు అనేకం. 1) భార్యను తిట్టడం, కొట్టటం. హింసించటం అసలు నేరాల్లాగాను, అవినీతికర విషయాలుగాను సమాజమూ, ముఖ్యంగా స్త్రీలూ పరిగణించటంలేదు. రాజులు దైవప్రతినిధులు అని ప్రజలు విశ్వసించిన రోజులు ఉన్నాయి. అలాగే భర్తలు పతిదేవులు. వారు భార్యలను బాధపెట్టటం ద్వారా దండించటం తప్పలేదట. వీటిని గురించి నేరారోపణ చేసే స్త్రీలు ఇంచుమించుగా లేనట్లే లెక్క.

2) భార్యలను చంపిన కేసుల్లలో, చంపటానికి ప్రయత్నం చేసిన సంద ర్భాలలో మాత్రమే కాస్త అలజడి కన్పిస్తున్నది. అయితే నిందితులు తప్పించుకొని

పోగల్గుతున్నారు. ఇరుగు పొరుగు ప్రజల అలసత్వంవల్ల వారు సాక్ష్యం చెప్పటం లేదు.

3) దుర్మార్గ ప్రవర్తనకు అవకాశం తీసుకొన్న భర్తలు అవినీతిపరులైన పోలీసుల సహాయంతో లేక ఈ కేసులపట్ల శ్రద్ధ చూపని పోలీసు అధికారుల అశ్రద్ధవల్ల హత్యలను ఆత్మహత్యలుగా రూపొందించగల్గుతున్నారు.

4) నేరానికి బలిఅయిన స్త్రీలే భర్తల దుష్టప్రవర్తనను తమ మరణ వాఙ్మూలాలలో వెలికి తీయటం లేదు.

5) భార్య తాలూకు బంధువులు కేసు విషయమై పట్టుదల చూపటంలేదు. చనిపోయినవారు తిరిగిరారు కనుక చనిపోయిన స్త్రీ సంతానపు శ్రేయస్సును రక్షించాలని అలా చేస్తున్నారు.

6) భర్త తల్లిదండ్రులు, వారి బంధువులు భర్తకు మద్దతును ఇచ్చి నేరాన్ని మాపుచేస్తున్నారు.

7) వైద్యులు, ఇతర నిపుణులు, లాయర్లు వీరి అశ్రద్ధ వల్ల లేక అవినీతివల్ల గాని నిందితునికిపరోక్షంగా లేక ప్రత్యక్షంగా సాయపడటం జరుగుతున్నది.

8) ఫలాన గ్రామంలో, పేటలో, బస్తీలో భార్యను హత్య చేసిన కేసు జరిగిందంటే గ్రామానికి, పేటకు, బస్తీకి అప్రతిష్ట అని తలంచి ఆ ప్రాంతపెద్దలు అంతా గుమిగూడిగాని లేక ఎవరికి వారుగా ఆలోచించిగాని కేసును కోర్టుకురాకుండా మాపు చేస్తున్నారు. ఏవో మాటలు చెప్పి, లేక బలి అయిన స్త్రీ తల్లిదండ్రులను బెదిరించి లేక వచ్చజెప్పి కేసును కోర్టుదాకా వారు-ఆ ప్రాంత పెద్దలు రానీయటం లేదు.

## అయితే ఈ అన్యాయాలు ఇలా సాగిపోవలసిందేనా ?

అక్కరలేదు. ఇవి కొనసాగటం న్యాయం కాదు. ధర్మం అంతకన్నా కాదు. మానవజాతికి ఇవి మారని మచ్చలు. స్త్రీ జాతికి కళంకాలు. మానవాళికి తీరని ద్రోహాలు. మహిళా ప్రపంచానికి గొడ్డలిపెట్టులు. వీటిని ఆపాలి. ఎలా?

ప్రజాభిప్రాయం ద్వారానే ఈ దుర్మార్గాన్ని ఆపగలం. శాసనాలు ఎంత మంచిగా ఉన్నా, ఎంత బలంగా ఉన్నా లాభంలేదు. సమాజంలో ప్రజాభిప్రాయం అత్యాచారాల నిరోధానికి సాయపడితేనే ఈ అక్రమాలు ఆగిపోతాయి.

## ప్రజాభిప్రాయం అంటే

సమాజంలోని ప్రజల అభిప్రాయాన్నే ప్రజాభిప్రాయం అంటున్నాం. ప్రయోజనులయిన స్త్రీలు పురుషులు, యువతీ యువకులు, విద్యార్థినీ విద్యార్థులు

బాలబాలికలు వీరంతా ప్రజలే. వీరిలో ఇలాంటి అమానుష చర్యలపట్ల ఏహ్యభావం ద్వేషం, క్రోధం, నిరసన వ్యక్తం కావాలి.

స్త్రీలలో ఇలాంటి భావం ఇంకా గట్టిగా ఉదయించలేదు. సుఖంగా కాపురం చేస్తున్నవారు ఇలాంటి దుర్మార్గాలు జరుగుతున్నాయంటే నమ్మటం లేదు. నమ్మిన వారయినా ఇవి చాల కొద్ది సంఖ్యలో ఉన్నాయని, సమస్య చిత్రించబడినంత పెద్ది దిగా కన్పించటం లేదని అంటున్నారు. ఇక జాగృతి, చైతన్యం లేనివారి స్థితిగతు లను గురించి చెప్పవలసిన అవసరం లేదు. వారికి ఈ దుష్టచర్యలు నేరాలు చెడ్డవి అనే భావన కూడా లేదు. భర్తలు ఇలాంటి అమానుష ప్రవర్తనతో గడుంగర్రాదనే భావాన్ని ప్రజల మనస్సులలో గట్టిగా నాటాలి?

## ఈ పనికి ఎవరు పూనుకుంటారు ప్రస్తుతం ?

జాగృతి, చైతన్యం కల స్త్రీలు, సమాజ సేవకులు, సహృదయులైన పురు షులు కొందరు మాత్రమే ప్రజాభిప్రాయాన్ని మలచటానికి పూనుకుంటున్నారు. ఇంకా కొందరు, మరికొందరు ఈ పనికి పూనుకోవాలి. అంతేకాదు చివరి దశలో ఇంచుమించుగా ప్రజానీకం యావత్తూ పూనుకునే స్థితి రావాలి.

## ముమ్ముందుగా స్త్రీలు ఏం చేయాలి ?

ప్రస్తుతం చైతన్యంకల స్త్రీల సంఖ్య స్వల్పంగా ఉంది. మహిళా సంఘాల సంఖ్య తక్కువగా ఉంది. మహిళోద్యమం దీనిపైన గట్టిగా దృష్టి సారించటంలేదు. ఎక్కువగా ఆరోగ్యం, జీవనోపాధి, అక్షరాస్యత పైననే నొక్కిపెట్టబడుతున్నది. కాని స్త్రీల హక్కులు, స్త్రీల రక్షణ, స్త్రీలకు సదుపాయాలు వసతులు, ప్రజాస్వామ్య వ్యవస్థలో భాగస్వామ్యం. వీటిపై స్త్రీలలో కూడా ఆదరణ లేదు. కనుక ఆ విష యమై. అంటే స్త్రీ విమోచన పరంగా భారీ ఎత్తున ప్రచారం సాగాలి. ఈనాడు మహిళా సంఘాలు కుట్లు, అల్లికలు, గృహనిర్వహణ, పిండివంటల తయారీ, గృహా లంకరణ వీటి విషయమై మాత్రమే—ఇది స్థూలంగా, మొత్తంమీద చెప్పేమాట— శ్రద్ధవహిస్తున్నాయి. అలాకాక ప్రబోధ కార్యక్రమాలను మహిళా సంఘాలు చేపట్టాలి.

సభలు, ఉపన్యాసాలు, అధ్యయన తరగతులు, చర్చలు, సారస్వత సృష్టి వీటన్నింటినీ వాడాలి. రేడియో, టి. వి. ల ద్వారా ప్రచారం సాగాలి.

## కేవలం స్త్రీల పరంగా చైతన్యం వస్తే చాలునా ?

చాలదు. స్త్రీలు సమాజంలో ఇంచు మించుగా సగం సంఖ్యలో ఉన్నావారి బలం తక్కువ. ప్రపంచం మొత్తం మీద స్త్రీలు ఉత్పత్తిరంగంలో రెండు వంతుల

వస్తూత్పత్తి సాగిస్తున్నా వారి వరుమానం ప్రపంచ ఆదాయంలో మూడవవంతు మాత్రమే. సోషలిస్టు దేశాలలో శాసన సభలలో స్త్రీల ప్రాతినిధ్యం 20 నుండి 30 శాతం ఉంటే వర్ధమాన దేశాలలో 5 శాతాన్ని మించడం లేదు. రాజకీయ పార్టీలలో కేంద్ర స్థానాలల్లో వారి ప్రాతినిధ్యం స్వల్పం. రాజకీయ, ఆర్థిక సాంస్కృతిక రంగాలలో ఉన్నత పదవులలోకి స్త్రీలను బహుళంగా రానీయటంలేదు. కనుక స్త్రీలు మాత్రమే మారినంత మాత్రాన పరిస్థితి పరివర్తన చెందదు. పురుషులు కూడా మార వలసి ఉంటుంది. అందుకు తగిన అవసరమయిన ప్రయత్నాలను చేయాలి.

## ప్రజాభిప్రాయ సేకరణ ఎలా జరగాలి?

ఈ అంశాన్ని ఒక్కసారిగా ఆలోచిద్దాం. ప్రస్తుతం ఇతర విధాల అత్యాచారాలను గురించి ఆలోచిద్దాం.



# 2. స్త్రీల వేధింపు

ఇది అనేక విధాలుగా సాగుతున్నది.

1) అవహేళన, ఎగతాళి, ఆటలు పట్టించటం.

2) స్త్రీలను లైంగికంగా చికాకు పరచటం.

4) స్త్రీలను అవమానించటం 4) స్త్రీల మానభంగాలు

ఇటీవల స్త్రీల వేధింపు ఎక్కువయింది. ఒకనాడు కేవలం సంఘ వ్యతిరేక శక్తులు, రౌడీలు, ఆకతాయి ముఠాలు మాత్రమే ఈ దుర్మార్గానికి పూనుకోవటం జరిగేది. ఇపుడు విద్యార్థులు, యువకులు, వృద్ధులు కూడా ఇలాంటి దుశ్చర్యలను చేస్తున్నారు. ఇది చాల ఆందోళనకరమైన విషయం.

స్త్రీలను అవమానించటం, అంటే మానభంగ నేరానికి తక్కువ స్థాయిలో జరిగే నేరాలను స్త్రీలపై జరిగే అత్యాచారాలు అని చెప్పవచ్చు. మానభంగం లేక చెరచటాన్ని [Rape] అనడం కద్దు. అంతకు తక్కువగా జరిగే లైంగిక కార్యానికి వేరే పేరు. అవమానించటం (Insulting the Modesty of a Woman) ఆమెను లైంగికంగా బాధించుట(Molestation) అలాంటివి. ఇవీ నేరాలే. వీటిని గురించి కూలంకషంగా వివరించటం అవసరం. అయినా గ్రంథ విస్తారమవుతుంది. కనుక ఈ చిన్నిపొత్తంలో వాటిని పెద్దగా ప్రస్తావించటం లేదు. అంటే మొదట రెండు రకాల వేధింపును గురించి మాత్రమే ఆలోచిద్దాం.

రెండు రకాల వేధింపుకు మూలకారణం ఒకటే. స్త్రీ భోగ్యవస్తువు మాత్రమే అనే భావమే ఆ చెడ్డ చర్యలకు మూలకందం. కావ్యాలలో, సాహిత్యంలో ఈ భావం ప్రస్ఫుటమయింది. శృంగారం జీవితంలో భాగమే. అందులో సందేహం లేదు. కాగా అదే జీవిత సర్వస్వం కాదు, కారాదు. స్త్రీ విధిగా ఏవరో ఒకరికి అంటే పురుషుల పరంగా మాత్రమే—చెంది ఉండాలనే ఆలోచన సమాజంలో ప్రబలంగా ఉంది. ఆడపిల్ల పుట్టింది మొదలు ఆమె పెండ్లిని గురించే ఆలోచిస్తారు ఆమె తల్లిదండ్రులు, బంధువులు, శ్రేయోభిలాషులు. ఆమె ఎవరో ఒక పురుషుని అధీనంలో ఉండాలి. తండ్రి, భర్త, కుమారుడు ఆమెకు రక్షకులు. ఈ మాటను మనువు చెప్పాడని కొందరంటే మనువు అలా చెప్పలేదని మరికొంతరు అంటారు. ఆ విషయం నిగ్గు తేల్చినా, తేల్చలేకపోయినా ఒకటిమాత్రం సత్యం. ఆ భావం సమాజంలో బలంగా ఉంది. అంతటితో ఆగితా ఫరవాలేదు. ఈ అభిప్రాయం ఎవరికి నష్టదాయకమో వాళ్ళే, అంటే స్త్రీలే దానిని బలపరుస్తున్నారు. ఇది శోచనీయం. స్త్రీకి యజమాని ఉండాలి. అందులో ముఖ్యంగా భర్త ఆ పదవిని స్వీకరించాలి. భర్త లేని స్త్రీ అందరి వస్తువు అనే భావం ఇక్కడ

ద్యోతకమవుతోంది. "ఎవ్వరి దానవీవు భీతహరిణేక్షణ!" అని మనుచరిత్రలోని కావ్యపురుషుడు అయిన ప్రవరాఖ్యుడు తనకు తటస్థపడిన వరూధునిని పలకరిస్తాడు. ఆమెకు వివాహం కాకపోతే ఆమెను ఎవరైనా ఆశించవచ్చు అనే భావం గాఢంగా ప్రజలలో నాటుకొని పోయింది. ఈనాడు విడాకులు పొందిన స్త్రీ కూడా అవివాహిత స్థాయిలోనే ఉంటున్నది. ఆమెకు "యజమాని" లేడు. కనుక ఆమెను ఆశించవచ్చును అనే భావం ప్రబలంగా వుంది. పడుపు వృత్తి సాగించే స్త్రీకి భర్త పేరుతో ఒక్క యజమాని ఉండడు. ఆమెను ప్రతివ్యక్తి ఆశించవచ్చు. ఇదీ ఆలోచనా ధోరణి.

ఇంతటితో ఆగదు ఈ ధోరణి. అవతలి వ్యక్తి అంటే స్త్రీ ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకపోతున్నది. ఒకనాడు మనదేశంలో రాక్షస, పైశాచిక వివాహాలు న్యాయసమ్మతం అయినాయి. ఈనాడు అలాకాదు. రాక్షస వివాహం అంటే కన్యను, ఆమె ఇష్టాయిష్టాలు తెలుసుకోకుండా, ఆమె తల్లిదండ్రులను లేక అన్నదమ్ముళ్ళను లేక బంధువులను లేక రక్షకులను ఎదిరించి, ఓడించి అవసరమయితే చంపి ఆ కన్యను తీసుకొనివచ్చి ఆమెను వివాహమాడటం లేక ఆమెకు పెండ్లి చేయించటం వీరోచితంగా భావించేవారు. భీష్ముడు తన తమ్ముళ్ళయిన విచిత్రసేనుడు విచిత్రవీర్యునకు ఇలా పెళ్ళిళ్లు చేశాడు. మత్తుకు లోనయిన స్త్రీని, నిద్రించే స్త్రీని ఆమె ఎరుక సమ్మతులులేకుండా ఆమెతో సంభోగకార్యం నిర్వర్తించి తర్వాత ఆమెను వివాహమాడటం పైశాచికం. మానభంగానికి లోనయిన స్త్రీని మానభంగానికి ఒడికట్టిన పురుషునికిచ్చి పెళ్ళిచేయిస్తున్నారు పెద్దలు. ఆకథలనే సినిమాలలో కూడా చూస్తున్నాం. రాక్షస పైశాచికభావాలు ఇపుడు శాసనసమ్మతం కాకపోయినా, చట్టప్రకారం చెల్లకపోయినా, పైగా నేరాలయినా—ప్రజలలో ఆదరణ పొందాయి. కొన్ని వర్గాలలో పెళ్ళికుమారుడు మల్లెపూలతో ముఖం కన్పడకుండా చేసుకొని గుర్రమెక్కి—పెళ్ళికి తరలి వస్తాడు. ఇది రాక్షస వివాహ ఆచరణలో మిగిలిపోయిన అలవాటు. ఇది ప్రాచీన భావ అవశేషం. ఈ భావాల ఆచరణ స్త్రీల వేధింపు. పెండ్లికాని పిల్లను అందరూ ఆశించవచ్చు కదా! అందరూ బలవంతం చేయవచ్చుకదా! బలవంతం అనేక రూపాలుగా సాగుతుంది. అందులో ఒకరూపం స్త్రీలను వేధించటం.

**1. ఎగతాళి, అపహాస్యం ;**

తెల్లరంగు గల అమ్మాయిని తెల్లజామకాయ అనడం, నల్లని అమ్మాయిని కాకి అని పిలవడం, అనాకారిని రంభ అని కేకవేయడం, మెల్లకన్నులున్న స్త్రీని "హరిణాక్షి" అని సంబోధించటంలాంటి ఎగతాళి చర్యలు అనంతంగా వున్నాయి.

ఆమె వెంటబడి ఇంటిదాకా వెళ్ళడం, త్రోవలో ఆమె అంగాంగ వర్ణన చేయటం, ఆమె కోపగించుకుంటే కోపగించుకున్నందుకు ఈసడించడం, ఆమె విసుక్కుంటే ఆమెను ప్రార్థించటం, ఆమె వడివడిగా నడిస్తే ఆమె వెంట పరుగెత్తటం, ఆమె ఆగి పోతే మార్గ మధ్యంలో ఆమెకు చేరువుగా ఆగిపోవటం ఇవన్నీ ఆమెను చికాకు పరిచే పనులు. విద్యాలయ తరగతుల్లో విద్యార్థినుల మీద కాగితపు విమానాలు విస రటం, నల్లబల్ల మీద విద్యార్థినుల "మారుపేర్లు" వ్రాయటం లాంటివి కోకొల్లలుగా వున్నాయి. ఇలాంటివి ఎన్నో స్త్రీలను బాధించే మార్గాలు వున్నాయి. ఇవి పెచ్చు పెరిగి స్త్రీలను న్యూనత పరుస్తాయి. చివరకు వారి ప్రాణత్యాగానికి దారితీస్తాయి. ఉదాహరణకు తనకూ మరొక అమ్మాయికి వివాహమని ప్రకటించే పెండ్లి పత్రిక లను ఒక యువకుడు అచ్చు వేయించి పంచటంవల్ల ఆ అమ్మాయికి తరువాత పెళ్ళికాక పోవడం జరిగింది.

ఒక మనిషి ప్రవర్తన ఇంకో మనిషికి బాధాకరంగా పరిణమించకూడదుకదా! స్వేచ్ఛ యొక్క అర్థం తెలిసిన ఏ వ్యక్తి మరొకరి స్వేచ్ఛకు అడ్డు రాకూడదు. స్వేచ్ఛ అంటే స్వ+ఇచ్ఛ అన్నమాట. అంటే ఒక మనిషికి ఇష్టమయినది అని అర్థం. ఒకమనిషి తన ఇష్టాన్ని అందరిమీద బలవంతంగా రుద్దటం ఏమిన్యాయం?

## లైంగిక వేధింపు (Sexual Harassment)

బస్సులలో, రైళ్ళలో జనం బాగా కూడే చోట స్త్రీల శరీరాలను తాకడం, ఒరుసుకుని నడవడం, వారి శరీర భాగాలను గిల్లడం, వాటికి వత్తిడి కలుగజేయడం ఇవి ఈ వేధింపు క్రిందికి వస్తుంది. వారు వినేటట్లుగా బూతు పాటలు పాడటం, ఈలలు వేయటం, చప్పట్లు చరచడం పేరుపెట్టి బిగ్గరగా పిలవడం ఈ కోవ క్రిందికే వస్తాయి. ఇవికాక కార్యాలయాల్లో, ఫ్యాక్టరీలలో, పొలాల్లో, పని ప్రాంతా లలో అజమాయిషీ చేసే పురుషులు స్త్రీ కార్మికులను, ఉద్యోగస్తులను అదలించి బెదరించి వారిని లైంగికంగా లొంగ తీసుకోవటం, కళాశాలల్లో ముఖ్యంగా వృత్తి కళాశాలల్లో – ప్రొఫెసర్లు శాఖాధికారులు విద్యార్థినులను బెదరించి వారిని వాడుకోవ టం, లేక అవమానించటం ఈ రకపువే.

ఇటీవల ఢిల్లి, హైదరాబాదు లాంటి నగరాలలో ఈ దుర్మార్గాలు ఎక్కువవు తున్నాయి. విద్యార్థుల జీవితాలు చెడిపోతవనే సానుభూతితో న్యాయమూర్తులు బహు స్వల్పమైన శిక్షలు వేస్తున్నారు. జరిమానా చెల్లించి మరీ పెచ్చుపెరిగి పోతున్నారు. ఆకతాయి యువకులు, విద్యార్థులున్నూ.

## స్త్రీల వేధింపును తగ్గించేదెలా ?

శిక్షలు ఎక్కువ జేస్తే మంచిదని ఒకరు, ఆకతాయి యువకుని తల్లిదండ్రుల ద్వారా ముఖ్యంగా తల్లిద్వారా – సంస్కరించాలని మరికొందరు నిరుద్యోగం వల్ల యువకులపై మానసికపు ఒత్తిడి వస్తున్నందున వారు అలా ప్రవర్తిస్తున్నారు కనుక నిరుద్యోగాన్ని నిర్మూలించాలని తలా ఒక సూచన చేస్తున్నారు. తమాషా ఏమంటే పరాయివాని చెల్లెను, అక్కను అల్లరి చేసే యువకుడు లేక విద్యార్థి తన చెల్లెలును లేక తన కుటుంబ స్త్రీని మరొక యువకుడు అల్లరి చేస్తే సహించడు. అతనిపై తగాదాకు, కొట్లాటకు దిగుతాడు. చివరకు హత్యకు కూడా ఒడికడతాడు. మరి తను అల్లరిచేసే యువతి మరొకని చెల్లి లేక కుటుంబ స్త్రీయే కదా? ఎందుకు ఇలా? తనకు ఒక న్యాయం, ఇతరులకు మరొక న్యాయమూను. ఇది భావ్యమా? ఇలా తనను తను ప్రశ్నించుకోడు కారణం స్వార్థం, అహంభావం. తన అక్క చెల్లెళ్ళను ఎవరూ ఏమి అనరాదు; తను మాత్రం అందరి స్త్రీలను అల్లరి పెట్టవచ్చు. ఇది అహంభావ ఫలితం. తను గొప్పవాడు. ఈ మనస్తత్వం ఎక్కువగా మంత్రుల కుమారులలో, ప్రజాప్రతినిధుల కుమారులలో కనిపిస్తున్నది. ఆస్తిపరుల కుటుంబాలలో, ధనవంతుల వంశాలలో ఇది ద్యోతకమవుతున్నది. దీనికి కారణాలు అనేకం

1) ఇళ్ళల్లో వారికి తగని పొగడ్తలు లభించాయి,

2) సమాజంలో అయాచితంగా గౌరవ మర్యాదలు వచ్చాయి.

3) వారు డబ్బుతో వంధి మాగధ బృందాలను, చీటికిమాటికి పొగిడే మనుష్యులను కొనుగోలు చేయగల్గుతున్నారు.

4) డబ్బుతో ఏదయినాసంపాదించగలమనేధీమాతోసంచరించగల్గుతున్నారు.

5) తల్లిదండ్రుల పదవులు వారికి సోపానాలు; అంతేకాదు రక్షణ కవచాలు.

## వీరిని శాసనాలు అరికట్టగలవా ?

లేవు. మరీ దుర్మార్గమయితే ఆందోళన వస్తుంది. చిన్న జరిమానాతో తప్పుకుంటారు నిందితులు. ప్రజలు "ఛీ ఛీ" అంటేకాని, తల్లిదండ్రులు, అన్నదమ్ములు అక్కచెల్లెళ్ళు వారిని నిరసిస్తేగాని పరిస్థితి మారదు. అంటే ప్రజాభిప్రాయం శాసనానికి అండగా మారాలి. ప్రజాభిప్రాయ నిర్మాణం ఎలా జరగాలనే అంశానికి వచ్చాము.

## ప్రజాభిప్రాయ నిర్మాణ విధానాలు

అత్యాచారాలకు, స్త్రీల వేధింపు, స్త్రీలపై నేరాలకు వ్యతిరేకంగా ప్రజాభిప్రాయ నిర్మాణం అనేక రంగాలలో జరగాలి.

**1. కుటుంబంలో :**

పిల్లల పెంపక బాధ్యత వహించేది తల్లిదండ్రులు. అందులో సర్వసాధారణంగా తల్లి ప్రముఖ పాత్ర వహిస్తున్నది. మనిషి యొక్క చిన్ననాటి భావాలు, అనుభవాలు, అభిప్రాయాలు చాలవరకు అతని యొక్క లేక ఆమె యొక్క జీవితాన్ని ప్రభావితం చేస్తాయి. పిల్లలు తల్లిదండ్రుల మాటలవల్ల, బోధలవల్ల, ప్రవర్తన వల్ల ప్రభావితం అవుతారు. అందులో తల్లిమాటలు, చేతలు, ఆమె చెప్పే కథలు, నీతులు బాల బాలికలను ఆకర్షిస్తాయి. కనుక తల్లులు తమ పిల్లలకు చెప్పే ప్రతి మాట, కథ వీటిని గురించి జాగ్రత్త పడాలి. వీటి వెనుక వారు విశ్వసించే విలువల సంచయం దాగి ఉంటుందని గ్రహించాలి. ప్రస్తుత సమాజంలో స్త్రీలు పురుషాధిక్య సమాజపు విలువలను తమవిగా చేసుకున్నారు కనుక తమకు తమ స్త్రీ జాతికి తీరని ద్రోహంచేసే భావాలను, అభిప్రాయాలను తమ సంతానానికి అందిస్తున్నారు. వారికి మానవ విలువలను గురించిన అభిప్రాయాలు మారితే ఆధునిక విలువలనే వారు తమ సంతానానికి అందిస్తారు. అందుచేత స్త్రీలలో ప్రబోధ కార్యక్రమం సాగాలి. తల్లులను చైతన్యవంతులను చేయాలి

**విద్యాలయాల్లో :**

కుటుంబాల తరువాత విద్యాలయాలు ప్రముఖంగా మన దృష్టిని ఆకర్షించాలి. ఇచ్చట ప్రచారం మూడు స్థాయిలలో జరగాలి.

1) పాఠ్యపుస్తకాల సమీక్ష :— పాఠ్య పుస్తకాలను పరిశీలించి స్త్రీ పురుష సమానత్వ భావనను వ్యతిరేకించే భావాలున్న భాగాలను తీసివేయాలి. 2) పాత ఉపాధ్యాయులకు, పాత ఆధ్యాపకులకు పునశ్చరణ తరగతులు నిర్వహించి వారిని సమానత్వ భావనకు సుముఖులను చేయాలి. 3) విద్యార్థి సంఘాలద్వారా, అధ్యయన కేంద్రాలద్వారా స్త్రీ పురుష సమానత్వ భావన విద్యార్థులలో బలపడే అన్ని చర్యలు తీసుకోవాలి. నాటకాలు, లలిత కళలు, జానపద రీతులు వీటి ద్వారా ప్రచారం ముమ్మరంగా సాగాలి.

**సమాజంలో ;**

తరువాత సమాజాన్ని సంస్కరించే కార్యక్రమాన్ని చేపట్టాలి. మహిళా సమాజాల ద్వారా ప్రబోధం విస్తృతంగా సాగాలి. ప్రబోధం రెండు పద్ధతులలో కొనసాగాలి. ముమ్మందుగా మూఢ విశ్వాస నిర్మూలన, తరువాత ఆధునిక భావ

ప్రచారం, పాతలోని చెత్తను తీసివేయాలి. నూతన భావాలలో, మంచిదానికి యుక్తి యుక్తమైన దానిని జిజ్ఞాసువులైన స్త్రీలకు అందించాలి.

యువజన సమాజాలు, బాలల అకాడమీలు, బాలల సంఘాలు, క్రీడా సంఘాలు, అన్నింట ఈ భావవ్యాప్తి జరగాలి. స్త్రీ పురుష వివక్షను కూకటి వేళ్ళతో పెకలించాలి. సాహిత్యం, నాటకం, నాట్యం, లలితకళలు జానపద గేయాలు ఒకటేమిటి అన్ని సాధనాలూ ఉపయుక్తాలే.

## ప్రభుత పరంగా

ప్రజాభిప్రాయ నిర్మాణంలో కేవలం కుటుంబంలో వారు, విద్యాలయాల వారు, సమాజంలో సంఘాలు ప్రజాభిప్రాయాన్ని సృష్టించినంతమాత్రాన చాలదు. ప్రభుత్వం కూడ ఆ విషయంగా కృషిచేయాలి. అది ఎలాంటి కృషియో వివరిద్దాం.

1) ముమ్మొందుగా ప్రభుత్వం వారి "స్త్రీలు, శిశువుల శాఖ"లో స్త్రీలయెడ వివక్షా నిర్మూలన విభాగం (**Department of Elimination of Diterimination against Women**) స్త్రీల హోదా పెంచే విభాగం (**Department of Enhancement of Status of Women**) అంటూ రెంటిని స్థాపించాలి.

2) 'స్త్రీల హోదా పెంచే విభాగంలో విభాగం'లో స్త్రీలకు అనుకూలంగా 'ప్రజాభిప్రాయ నిర్మాణ సెల్' (**Creation of Public opinion in Favour of Women cell**) ఏర్పాటు చేయాలి. దానికి ఇంచుమించుగా స్వతంత్ర ప్రతిపత్తి (**Autonomy**) ఉండాలి.

3) ఈ విభాగాలకు, సెల్‌కు తగినంతగా పైకాన్ని ప్రభుత్వ బడ్జెటులో కేటాయించాలి.

## ప్రజాభిప్రాయ నిర్మాణ సెల్ కర్తవ్యం

1) స్త్రీలకు అనుకూలంగా ప్రజాభిప్రాయ నిర్మాణంలో ప్రభుత్వం ఎంతో కృషి చేయవలసి వుంది. అందుకు అవసరమయిన చిత్తశుద్ధి, పట్టుదల సామర్థ్యం పూనిక, పౌరవ ప్రభుత్వాధికారులకు ఉండాలి.

2) వారికి సమస్యయొక్క పరిధి, అవగాహన ఉండాలి.

3) సమస్యా పరిష్కారానికి కావలసిన వనరులను, సాధన సంపత్తిని, సిబ్బందిని సమకూర్చుకోవాలి.

4) ప్రజాభిప్రాయ నిర్మాణానికి అవసరమైన చర్యలను రూపొందించుకోవాలి.

5) వాటిలో ముందు వెనుకల నిర్ణయం జరగాలి.

6) పరిశోధనా సంస్థలను నెలకొల్పుకోవాలి.

7) అమలు పరచిన చర్యలను మదింపు వేసే పద్ధతిని ఏర్పాటు చేసుకోవాలి.

పైవన్నీ ప్రభుత్వ శాఖ ఆంతరంగిక వ్యవస్థా నిర్మాణానికి చెందినవి.

**అలాకాక ప్రజలతో సంబంధం వున్న, ఉండాల్సిన చర్యలు ఇలా వుండాలి :**

1) స్వచ్ఛంధ సంస్థలతో సహకారం ఏ మేరకు, ఏ పరిధిలో సాగాలో ప్రభుత్వ శాఖలు నిర్ణయించుకొని వ్యవహరించాలి.

2) స్వచ్ఛంధ సంస్థలు చేపట్టలేని కార్యక్రమాలను మున్ముందుగా చేపట్టాలి వనరులు లేకనో లేక సిబ్బంది లేకనో, అవసరమైన సాధన సంపత్తి ఒనగూడకనో స్వచ్ఛంధ సంస్థలు కొన్ని కార్యక్రమాలను, ముఖ్యంగా పరిశోధనకు(Research), సంబంధించినవి చేపట్టలేవు. వాటి కోసం ప్రభుత్వమే పూనుకోవాలి.

3) ఈ కార్యక్రమంలో ఈ సెల్ వారు అన్ని ప్రభుత్వ శాఖల సహాయ సహకారాలను అర్థించాలి, పొందాలి. నాటకం, నాట్యం, ఫిలిం విభాగం, రేడియో, దూరదర్శన్ అన్ని శాఖలవారి తోడ్పాటును

4) విద్యాలయాలు, యువజన కేంద్రాలు, మహిళా సంఘాలు, బాలల కేంద్రాలు, వయోజనకేంద్రాలు, ఉద్యోగసంఘాలు, కార్మిక సంఘాలు అన్నింటినీ ఈ మహోద్యమంలో సమీకరించాలి.

5) సభలు, మహాసభలు, సదస్సులు, చర్చావేదికలు, గోష్టులు నిర్వహించ టానికి సాయపడాలి.

6) అవసరమైన సారస్వత సృష్టి, ఫిలింల తయారీ, రేడియో సాహిత్య సృష్టి, దూరదర్శన్‌ల ద్వారా ప్రదర్శనలు, జానపద కళారీతుల ద్వారా ప్రచారం లలితకళల ద్వారా ప్రబోధం ఇవన్నీ జరిపించాలి.

కేవలం ప్రజాభిప్రాయం అనుకూలంగా వున్నా చాలదు. అది కార్యరంగం లోకి దిగాలి. అత్యాచారాలు చేసే వ్యక్తులను తిట్టినంత మాత్రాన చాలదు. నిరసన వ్యక్తం చేసినంతమాత్రాన చాలదు. అటువంటి దుర్మార్గులను అరికట్టాలి. అటువంటి

దుష్టులను శిక్షించాలి. దీనికి ఏ వ్యక్తి అయినా కృషి చేయవచ్చు. కాని అందరు మనుషులకు అది సాధ్యం కాకపోవచ్చును. ఏ కొద్దిమంది మాత్రమే సమర్ధవంతంగా తమ విద్యుక్త ధర్మాన్ని నిర్వహించగలరు. అయితే దుర్మార్గులను అరికట్టడంలో అశక్తులయిన వ్యక్తులు కలసి సంఘంగా ఏర్పడి దుర్మార్గాలను నిరోధించగలరు. ఈ సందర్భంగా ఇరుగు పొరుగు సంఘాలు, పౌర సంఘాలు, ఇతర సంఘాలు, రాజకీయ పార్టీలు ఎంతో కృచేయుటానికి అవకాశం వుంది. దుశ్చర్యల నిరోధం మాత్రమేకాక బలయిన వ్యక్తులకు, స్త్రీలకు నష్టపడే సంతానానికి అండదండలను అందించాలి. ఆశ్రయం, బలం నైతికంగా, ఆర్థికంగా, మానసికంగా విద్యాబుద్ధులు చెప్పించటం, పునరావాసం, ఉపాధికల్పన, వీటినన్నింటిని ఆ సంఘాలు తాముగా కాని సంఘాలతో, సంస్థలతో కలసి కాని కల్పించాలి. ఇలాంటి వాతావరణం కలుగు కొలదీ స్త్రీలపై అత్యాచారాల సంఖ్య తగ్గిపోతుంది. తప్పుడు పనులు వారి గుండె దడ ప్రారంభమవుతుంది. వారి ధృతి నశిస్తుంది. వారు పాడుపనులు చేయటానికి సాహసించరు.

స్త్రీలలో ఆత్మస్థయిర్యం వృద్ధి అవుతుంది. వారు తాముగా అత్యాచారాలను ఎదురొడ్డి నిలవగలుగుతారు. అలాంటి వైఖరిని ప్రదర్శించగల స్త్రీలను చూచి సంఘ వ్యతిరేకులు భయపడతారు. దాంతో అత్యాచారాలకు అనుకూలమైన వాతావరణం నశిస్తుంది.

**ముగింపు :**

అత్యాచారాలు అంటే ఏమిటో, వాటి స్వభావ స్వరూపాలేమిటో, వాటికి అనుకూలమయిన వాతావరణం ఎలా ఏర్పడిందో, అత్యాచారాలలో భార్యలపై హింస, భార్యలను తగలెయ్యడం. స్త్రీల వేధింపు ఎలాంటిదో ఇంతవరకు వివరించటం జరిగింది. అంతేగాక వీటిని నిరోధించే ప్రయత్నంలో ఎవరెవరి పాత్ర ఎలాంటిదో కుటుంబంలో, విద్యాలయాల్లో, సమాజంలో ప్రభుత్వపరంగా ఎలాంటి చర్యలు అవసరమో, ఎలాంటి వాతావరణ దృష్టి అవసరమో విశదీకరించాం. ఇకముందు వచ్చే అధ్యాయంలో అత్యాచారాల నిరోధం అనే అంశాన్ని మరోదృష్టితో గమనిద్దాం.*



# 3. స్త్రీలపై అత్యాచారాల నిరోధం

స్త్రీలపైనే దౌర్జన్యం ఎందుకు జరుగుతోంది? అది ఏనాటినుండి? ఎవరు చేస్తున్నారు? కొట్టటం, తిట్టటం, వెళ్ళగొట్టటం. కాల్చటంలాంటి చర్యలు అనాదిగా జరుగుతున్నాయి. శారీరక హింస చేసేవారు కొందరయితే, మానసిక హింస చేసే వారు మరెందరో వుండగా రెండూ ఏకకాలంతో జరిపే వారి సంఖ్య అత్యల్పం అసలేకాదు. మరి ఈ బాధలు అనుభవించే వారంతా దిష్టిబొమ్మల్లా, మూగజీవాల్లా పడి వుండటానికి కారణమేమిటి? ఇన్ని మరణాలకు, హత్యలకు, ఆత్మహత్యలకు పరిష్కారాలు ఏమిటి? ఎలా అనేవి ఈనాటి సభ్యసమాజాన్ని కలవరపెడుతోంది. కనుక ముందుగా కొన్ని లెక్కలను గమనించి, పరిశీలించి, పరిష్కారాలను అన్వేషించటం సముచితం.

1988లో దేశం మొత్తం మీద వరకట్న మరణాల సంఖ్య సహృదయులైన స్త్రీ పురుషులను దిగ్భ్రాంతి కొల్పేటట్లుఉంది. ఉత్తరప్రదేశ్‌లో 724, మహారాష్ట్రలో 294, మధ్యప్రదేశ్‌లో 210, కర్నాటకలో 179, ఆంధ్రప్రదేశ్‌లో 90, తమిళ నాడులో 71, పశ్చిమబెంగాల్‌లో 145, కేరళలో 6. ఇవి ప్రభుత్వ లెక్కలు. ఇటీవల ఆంధ్రప్రదేశ్‌లో విపరీతంగా ఈ రకపు నేరం పెరుగుతున్నది. 1989 సంవత్సరాన్ని లెక్కకు తీసుకుంటే వార్తాపత్రికల కథనం ప్రకారం ప్రతి రెండు రోజులకు ఒక్క హైదరాబాద్ ప్రాంతంలోనే ఒక వరకట్న మరణపు హత్య జరుగుతున్నది. గత మూడేళ్ళలో ఈ విధపు నేరం ఎంతగా పెరిగిందో ఊహించుకోవచ్చు. వరకట్నం కోసం అత్తమామలు, భర్త బాధిస్తే స్త్రీ ఆత్మహత్య చేసుకున్నదని వచ్చే పోలీసుల ప్రకటనలలో 90 శాతం హత్యలే.

1987లో 1572 వరకట్న మరణాలు సంభవించాయి. అందులో మూడవ వంతు (533) ఉత్తరప్రదేశ్‌లో జరిగాయి. (రాజ్యసభలో మంత్రి చిదంబరంగారి సమాధానం) మహారాష్ట్రలో 250 జరిగినట్లు లెక్క.

1979 దేశం మొత్తంమీద స్త్రీలపై నేరాలసంఖ్య ఫిర్యాదుల లెక్క ప్రకారం 4, 300, 1980లో అది 5023గా నమోదు అయినాయి. మానభంగాల సంఖ్య సంవత్సర సంవత్సరానికి పెరుగుతున్నది.

భార్యలను కొట్టడం, బాధించడం, చిత్రహింసలు పెట్టటం, భర్తలు భార్యలను మానభంగం చేయడం వీటికి లెక్కలు లేవు. భారతదేశంలో ఇప్పటికీ ఇలాంటి

నేరాలను గురించి భార్యలు భర్తలపై ఫిర్యాదు చేయరు. అదే అమెరికా సంయుక్త రాష్ట్రం అయితే అన్నింటికీ లెక్కలే, బోస్టను నగరంలో ఏటా ఒక లక్షమంది భార్యలు భర్తల చేత చావు దెబ్బలు తింటారట.

**ఆందోళనకు కారణం :**

ఈ దుర్మార్గాలు పెచ్చుపెరుగుతున్నందున ప్రభుత్వాలు, విశ్వవిద్యాలయాలు, స్త్రీల సంఘాలు, స్వచ్ఛంద సంస్థలు, పత్రికలు ఆందోళన చెందుతున్నాయి. అధ్యయన వేదికలు, చర్చలు, సభలు, మహాసభలు నిర్వహిస్తున్నాయి. స్త్రీలపై అత్యాచారాలు ఎందుకు జరుగుతాయి. ఎవరు కారణభూతులు అనే అంశాల జోలికి ఈ మహాసభ ప్రత్యేకంగా పోనక్కరలేదేమో. కాకపోతే ఆ అంశాలను చర్చల సందర్భంగా కదాచిత్తుగా స్పృశించక తప్పదు.

ఒక సమస్యను లోతుగా కూలంకషంగా అధ్యయనం చేయాలంటే దానిని వివిధ భాగాలుగా విడమర్చి చర్చించటం అవసరం.

వాటిని ఇలా పేర్కొనవచ్చు.

1) అత్యాచారపు వార్త రాగానే ఏం చేయాలి (తక్షణ కర్తవ్యం)

2) ఎవరి జోక్యాన్ని ఆశించాలి?

3) కేసులు నడపటానికి, దుర్మార్గానికి బలి అయిన స్త్రీని ఆదుకోటానికి ఏం చేయాలి?

4) ఇలాంటి నేరాలు ఇకముందు జరగకుండా చేపట్టవలసిన చర్యలుఏమిటి?

**తక్షణ చర్యలు :**

స్థూలంగా వాటిని ఇలా పేర్కొనవచ్చు.

1) పోలీసులకు ఫిర్యాదు చేయటం. దీనిని ప్రథమ సమాచార నివేదిక అంటాము. దీనిపై రిపోర్టు ఇచ్చేవారు దస్కతు చేయాలి.

2) వరకట్నపు ఆత్మహత్య అయినా హత్య అయినా (మామూలుగా దుష్టులయిన భర్తలు గొంతు పిసికి భార్యలను చంపి శవాలను కిరసనాయిలు పోసి తగలేస్తున్నారు) బలి అయిన వ్యక్తి శరీరాన్ని కదలించకుండా ఉంచడం.

3) నిందితులు అనగా భర్త, అత్త, మామ, ఆడబిడ్డ నేరం జరిగిన ప్రదేశాన్ని దాని స్థితిగతులను మార్పు చేయకుండా జాగ్రత్త తీసుకోవడం, వారు అలా చేయపూనుకుంటే నిరోధించటం.

4) ఇరుగు పొరుగువారు తాము విన్నదీ కన్నదీ పోలీసులకు చెప్పటానికి సిద్ధపడటం, అంతేగాక సమాజసేవిక లేక మహిళా సంఘ కార్యకర్త అలా వారిని సిద్ధం చేయటం.

౫) పోలీసులు చేయించే శవ పంచాయితీకి ముందుగా చనిపోయిన స్త్రీ, లేక అత్యాచారానికి బలి అయిపోయిన స్త్రీ తల్లిదండ్రులకు కబురు పెట్టుట లేక కబురు చేయించుట.

౬) శవపంచాయితీ అపుడు మధ్యవర్తులుగా ఉండుటకు సమాజ సేవకులు మహిళాసంఘ కార్యకర్తలు సిద్ధపడుట. మామూలుగా నిందితుడయిన భర్త బంధువులు, స్నేహితులు, ఆప్తులనే పంచాయితీదారులుగా ఎంపిక చేయటం కనిపించే అంశాలను కనుమరుగు చేయటం (గొంతు పిసికిన, ఉరివేసిన గుర్తులను వ్రాయకపోవటం, ఆమె శరీరంపైన ఉన్న గాయాలను, దెబ్బల గుర్తులను గమనించక పోవటం జరుగుతున్నది) సంభవిస్తున్నది. ఈ సందర్భంగా అప్రమత్తత అవసరం.

7) చనిపోయిన స్త్రీ, బలి అయిపోయిన స్త్రీ బంధువులు, తల్లిదండ్రులు ఏం చేసినా పిల్ల రాదుకదా అంటూ కేసును మాఫీ చేసే ప్రయత్నం చేస్తే వారిని అటకాయించుట.

8) నిందితుల గుండెలలో భయం కల్పించేనిమిత్తం చుట్టుప్రక్కలవారు, మృతురాలయిన స్త్రీ యొక్క బందుగులు, డాక్టరు శవ పరీక్ష చేసే ఆస్పత్రికి వెళ్ళుట. అత్యాచారానికి గురి అయిన స్త్రీ చనిపోకపోతే ఆమెతోపాటు ఆస్పత్రికి వెళ్ళుట. అలాగే మానభంగానికి గురి అయిన స్త్రీతోపాటు పోలీసుస్టేషన్‌కు, ఆస్పత్రికి వెళ్లుట.

9) నేరాన్ని గురించి ఇరుగు పొరుగు ప్రాంతాలలో నిరసన భావం, ఆందో వ్యక్తం చేయించుట.

10) పోలీసులకు నేరాన్ని గురించి తమకు తెలిసిన సమాచారాన్ని అందించటం.

11) అవసరమయితే న్యాయసలహా సంఘాలు, కుటుంబ సలహా కేంద్రాలు, సహృదయులయిన న్యాయవాదులు వీరి సహాయాన్ని పొందటం.

12) కేసును స్థానిక పోలీసులు, సక్రమంగా నిర్వహించకపోతే పై అధికారులకు, స్త్రీల రక్షణ విభాగపు ఉన్నత పోలీసు అధికారికి తెలియజేయుట.

13) పత్రికలలో ఈ దుర్మార్గాన్ని గురించిన వార్తలు ప్రచురింపచేయుట.
14) బలయిన స్త్రీకి రక్షణ ఇచ్చుట, రక్షణ గృహాలలో లేక శరణాలయాలలో ఆమెను ఉంచుట. ఆమె చావుబ్రతుకుల్లో ఉంటే ఆమె మరణ వాఙ్మూలాన్ని మేజిస్ట్రేటు చేతగాని, డాక్టరుచేతగాని నమోదు చేయించటం. అది వీలు కాకపోతే ఆమె పెద్ద మనుష్యులకు చెప్పినదానిని వారు గుర్తుగా వ్రాసుకొనునట్లు చేయించటం ముఖ్యమైన అంశం ఏమంటే నేరస్తులయిన భర్త, అత్తమామలు వచ్చి చావుబ్రతుకులలో ఉన్న ఆమెపై మానసికంగా వత్తిడి తెచ్చి తమను కాపాడమని అభ్యర్థించే ప్రయత్నాన్ని నిరోధించుట. (చనిపోతున్న ఆమె తన పిల్లలను తలుచుకొని "తల్లి ఎలాగూ ఉండదు, తండ్రి అయినా ఉంటాడు" అని తలపోసి తానే స్టవ్ వెలిగిస్తూ ప్రమాదానికి లోనయినట్లు అబద్ధం చెప్తుంది)

II) కేసుల సందర్భంగా ఎవరెవరి జోక్యాన్ని, సహాయాన్ని ఆశించాలి?

1) అత్యాచారానికి గురి అయిన స్త్రీ తల్లిదండ్రులు, అన్నదమ్ములు, బంధువులు.

2) ఇరుగు పొరుగువారు

3) నేర సందర్భంగా కొట్టటం, కిరసనాయిలు పోయటం, ఆమె కేకలు పెట్టటం, అంతకుముందు భార్యాభర్తలు, అత్తాకోడళ్లు, ఆడబిడ్డ వదినలు ఘర్షణ పడటం, వరకట్నం తెమ్మని పీడించటం, ఆ సంబంధంగా పంచాయితీలు, పెండ్లి అపుడు కట్నం ఇవ్వడం, మానభంగపు కేసు అయితే బలిఅయిన స్త్రీ కేకలు వేయడం, ఆమె పెనుగులాడటం, నేరస్తుడు పారిపోవడం ఇత్యాది విషయాలను చూచిన వారు, విన్నవారు.

4) పోలీసులు

5) ప్రభుత్వ డాక్టరు, ఆస్పత్రి అధికారులు.

6) శవ పరీక్ష చేసే డాక్టరు.

7) రసాయన పరీక్ష చేసే నిపుణుడు.

8) స్థానిక మునిసిపల్ కార్పొరేటర్లు, కౌన్సిలర్లు, సర్పంచ్ వగయిరాలు, యువజన సంఘం, మహిళా సంఘాల కార్యకర్తలు.

9) న్యాయసలహా కేంద్రాలవారు, కుటుంబ సలహా ఇతర సంస్థల వారు.

10) నేరానికి గురి అయిన ఆమెకు రక్షణ ఇవ్వటానికి లేక ఆశ్రయం ఇవ్వటానికి శరణాలయ అధికారులు.

11) పోలీసులలో ఉన్నతాధికారులు(స్థానిక పోలీసు ఇన్‌స్పెక్టర్ తన విధి నిర్వహించకపోతే)

12) స్త్రీల రక్షణ విభాగపు ఉన్నత శ్రేణి, పోలీసు అధికారి. (Women protection cell)

**III కేసు నిర్వహణ విషయమైన చర్యలు** (Remedial Measures)

1) బలి అయిన ఆమె మానసిక స్వాస్థంను గురించి శ్రద్ధ తీసుకోవడం.

2) ఆమెకు వైద్య సహాయం

3) ఆమెకు పునరావాస సౌకర్యం ఏర్పరచటం

4) శవ పరీక్ష చేసిన డాక్టరు, రసాయనిక పరీక్ష చేసే నిపుణుడు త్రోవ తప్పి వాస్తవాలను వక్రీకరించే ప్రయత్నం చేస్తే దానిని సర్వవిధాలా అటకాయించటం.

5) ఏ వ్యక్తి అయినా తన సాక్ష్యాన్ని మారుస్తారని కార్యకర్తలు భావిస్తే ఆ వ్యక్తి సాక్ష్యాన్ని ప్రమాణం మీద మేజిస్ట్రేటు ఎదుట ఇచ్చేలాగున ప్రయత్నించడం, దీనిని 164 సి. ఆర్. పి. సి స్టేట్‌మెంటు అంటారు. పోలీసులకు ఇచ్చే 162 సి. ఆర్. పి. సి స్టేటుమెంటుపై సాక్షి దస్కతు చేయనక్కరలేదు. వాఙ్మూలంపై సాక్షిదస్కతుచేయాలి లేక వ్రేలి గుర్తు వేయాలి.

6) ఆలస్యం చేయకుండా పోలీసులు ఛార్జిషీటు (అనగా కేసు దాఖలు చేయటం) దాఖలు చేసేలాగ వారిపై ఒత్తిడి తేవటం.

7) నేరం జరగగానే ఆ స్త్రీ భర్తను, అత్తను, మామను, ఆడబిడ్డను అరెస్టు చేయించి అంతటితో తృప్తిపడె కేసుకు గురించి పట్టించుకోకపోవటం సర్వసాధారణంగా జరుగుతున్నది. నిందితులఅరెస్టులుముఖ్యంకాదు. కేసునడకముఖ్యం.

8) న్యాయసలహా కేంద్రపు సహాయంతో ఉచిత న్యాయ సహాయాన్ని లేక స్వచ్ఛంధ సంస్థల న్యాయసహాయాన్ని, నేరానికి గురి అయిన ఆమె ధనవంతురాలయితే ఆమె న్యాయవాది యొక్క సహాయాన్ని పొంది కేసు నడుపుకోవాలి. ప్రభుత్వ న్యాయవాదికి సహాయంగా పనిచేయటానికి మరొక న్యాయవాదికి అవకాశం ఇమ్మని కోర్టువారిని అభ్యర్థించాలి.

9) విషయాలు తెలిసినవారు, నేర సంబంధమైన సంఘటనలను చూచినవారు విన్నవారు కోర్టులో నిజం చెప్పడానికి సిద్ధపడాలి. వారు అలా చెప్పటానికి వారికి అవసరమయిన ఆత్మవిశ్వాసాన్ని, రక్షణను వారికి కల్పించాలి.

10) నేరానికి గురిఅయిన ఆమె సంతానాన్ని ఆదుకొనడానికి ఆశ్రయం కల్పించడానికి, అవసరమయితే కోర్టుద్వారా వారికి ఆస్తి, మనోవర్తి ఇప్పించడానికి స్వచ్ఛంధ సంస్థలు, మహిళా సంఘాలు పూనుకోవాలి.

11) నేరానికి గురి అయిన ఆమె బ్రతికితే ఆమె జీవనోపాధికి, కోర్టుద్వారా మనోవర్తి, విడాకులు, లేక వేర్పాటు (Judicial Seperation) ఉత్తర్వులు ఇప్పించాలి.

**Iv) నివారణోపాయాలు** (Preventive Measures)

ఇవి చాల విస్తృతమయినవి, వైవిధ్యం కలవి. 1) సమాజపరంగా 2) పోలీసులపరంగా 3) అధికారులపరంగా 4) న్యాయస్థానాల పరంగా 5) శాసన పరంగా

**A) సమాజపరంగా ఏమి జరగాలి.**

1) స్త్రీలను మానవులుగా పరిగణించే భావం ప్రజలలో వ్యాప్తి చేయుట

2) స్త్రీ పురుషుల సమానత్వ భావనను పెంపొందించుట.

3) స్త్రీలపట్ల వివక్ష అన్ని రంగాలలో ఆహారం, దుస్తులు విద్య, విశ్రాంతి వేతనాలు, ఆరోగ్యం, వైద్యం, శిక్షణ, వగయిరా వసతుల ఏర్పాట్లలో స్త్రీలకు వ్యతిరేకంగా వివక్షను వ్యతిరేకించుటం.

4) కొన్ని సందర్భాలలో అంటే మాతృత్వం, శిశుపోషణ, వగయిరా విషయంగా ప్రత్యేక వసతులు కల్పించి గౌరవించాలనే భావం కల్పించడం.

5) స్త్రీలలో జాగృతి, చైతన్యం పెంపొందించుట.

6) స్త్రీలను ఇతోధికంగా విద్యావంతులను చేయుట

7) వారి హక్కులను వారు గుర్తెరిగేలా చేయుట.

8) స్త్రీలకు, పురుషులకు మానవ విలువలనుగురించి ప్రబోధం సాగించుట

9) స్త్రీలపై జరిగే అత్యాచారాలకు దిగ్భ్రాంతి చెంది, నిరసన ప్రకటించి, కార్యాచరణకు గడంగే మనస్తత్వాన్ని వారికి అలవరచుట.

10) పిన్న వయస్సులోనే బాలబాలికలకు స్త్రీ పురుష వివక్ష తగదనే భావం కలిగించటం, దాని కనుగుణమైన ప్రవర్తన అలవాటు చేసుకోవడం నేర్పాలి.

11) భారత రాజ్యాంగపు మౌలిన హక్కులను గురించి విశ్వ మానవ హక్కుల ప్రకటనను గురించి విషయ పరిజ్ఞానాన్ని అందించుట.

12) స్త్రీల సమస్యలపై పరిశోధన, అధ్యయనం, చర్చలు, ఆలోచన సాగాలి.

13) "స్త్రీల పరంగా స్త్రీల చేత, స్త్రీలకొరకు" ఆలోచన, అధ్యయనం, కార్యాచరణ కొనసాగాలి. అంతే సహృదయాలయిన పురుషుల సహకారం అక్కర లేదని కాదు.

14) అధికారుల చర్యలపై నిరంతరం నిఘావేసే మనస్తత్వం, వేయగల సత్తా స్వచ్ఛంద సంస్థల కార్యకర్తలకు, మహిళాసంఘాల కార్యకర్తలకు అవసరం.

15) సంఘసేవ పూర్వంవలె కాక నైపుణ్యాన్ని కోరుతున్నది. కనుక ఉన్నతశ్రేణి నైపుణ్య సముపార్జన వారికి అవసరం.

16] తాత్కాలిక ఆవేశాలకు, ఉద్రేకాలకు లోనయి అసలు ఆదర్శాలను, లక్ష్యాలను ప్రజలు మరచిపోకుండుట.

## B] పోలీసుల పరంగా జరుగవలసిన పనులు

పోలీసులు రెండు రకాలు, అవినీతి పరులు, సదాశయాలు కలవారు.

a] అవినీతి పరులు :— ఇటీవల పోలీసు బలగంలోకి అవినీతి పరులు ప్రవేశిస్తున్నారు. క్రొత్తవారిని ఎంపిక చేయటంలో లోపభూయిష్టమైన విధానాలను అనుసరించటం వల్ల జరుగుతున్నది. వ్యక్తి ప్రావీణ్యతకూ, పాండిత్యానికీ, ఇతర గుణగణాలకే కాక ప్రజాస్వామ్యం, స్త్రీ పురుష సమానత్వం, లౌకికతత్వం, స్వేచ్ఛలాంటి మౌలిక లక్షణాలపై గౌరవం, ఆదరణ కలవారినే పోలీసుబలగం లోకి చేర్చుకోవడం అవసరం. అవినీతి పరులను కఠినంగా శిక్షించే విధానాన్ని రూపొందించాలి.

b)సదాశయాలు కలవారు : i] వీరికి సదాశయాలున్నా పితృస్వామ్యవ్యవస్థ యొక్క మౌలిక విలువల పట్ల గౌరవభావం నశించటం లేదు. వారికి ప్రబోధం సాగాలి.

ii) స్త్రీలకు వ్యతిరేకంగా జరిగే నేరాలు వారికి క్రొత్త విషయంగా తోస్తుంది తమ విద్యుక్త ధర్మం క్రింద భావించరు. వారికి నూతన వైఖరిని అలవర్చాలి.

iii) పోలీసులలో స్త్రీ పోలీసుల సంఖ్య తగినంతగా ఉండాలి.

iv] శిక్షణ శిబిరంలో వారికి అనేక క్రొత్త విషయాలను పరిచయం చేయించాలి.

v) పోలీసుశాఖ నిబంధనల సంహితను(Police Manual) మార్చాలి.

vi] వారికి పునశ్చరణ తరగతులను నిర్వహించాలి.

vii] పోలీసులకు ప్రజల యెడ ముఖ్యంగా బలహీనవర్గాల స్త్రీలు, దళితులు గిరిజనుల యెడ సోదర భావాన్ని పెంపొందింపచేయాలి.

**viii) స్త్రీల సముద్ధరణకు, స్త్రీలకు సహాయం చేయటానికి పోలీసులను సమాయత్తం చేయాలి.**

ix] పోలీసు స్టేషనులలో పరిశుభ్రత, మంచి వాతావరణం, తగినంత సిబ్బంది, వలసిన సౌకర్యాలు ఉండాలి. మర్యాదస్తులయిన పౌరులు అందులో ముఖ్యంగా స్త్రీలు ఆత్మగౌరవంతో స్టేషనులలో ప్రవేశించి అధికారులతో సంప్రతించగల అవకాశం కలగాలి.

x] వారికి అవసరమైన రవాణా, వార్తా ప్రసార, నేర నిరోధక సౌకర్యాలు ఉండాలి.

xi] వారికి స్త్రీలకు సంబంధించిన శాసనాల విషయ పరిజ్ఞానం ఏర్పరచాలి.

xii] రాజకీయపరమైన వత్తిడులు, ప్రజలలోని కొన్ని సెక్షనుల నుండి సిఫారసులు లేకుండా ఏర్పాటు జరగాలి.

xiii] నేరాన్ని గురించి ఏ సమయంలో ఎలా వ్యవహరించాలో చిత్తశుద్ధికల అధికారులకు స్వాతంత్ర్యం ఉండాలి.

xiv] నేరస్థుడు ఏ కారణం వల్ల నయినా న్యాయస్థానం చేత నిర్దోషిగా వదలి వేయబడినా దర్యాప్తు చేసిన పోలీసు అధికారి నిస్పృహ చెందరాదు. అతని లోపం లేకుంటే చాలు. అలసత్వ వైఖరికి అతడు దూరంగా వుండాలి.

xv] రాష్ట్ర ముఖ్య పట్టణాలలో ఏర్పరచిన స్త్రీల రక్షణవిభాగం (Women Protection cell) లాంటి వాటిని కనీసం జిల్లా కొకదానిని ఏర్పరచాలి. రాష్ట్ర అధికారిగా ఉన్నత శ్రేణి ఆఫీసరును, అనుభవంగల ఆఫీసరును నియమించాలి. ఆ విభాగాలకు వసతులు, సౌకర్యాలు, అధికారాలు వీటిని ఒనగూర్చాలి. రాజీ పేరుతో వారు స్త్రీలను సర్దుకుపొమ్మని చెప్పే వైఖరిని అవలంబించరాదు.

xvi] ప్రతి పోలీసు స్టేషన్‌లోను తగినంతమంది మహిళా పోలీసులను నియమించాలి. అలాగే మహిళా అధికారులను నియమించాలి.

xvii] ఈ దిగువ చర్యలు కూడా ఉపకరిస్తాయి.

స్త్రీలను అవసరమయితే తప్ప అరెస్టు చేయరాదు.
పోలీసు లాకప్పులలో పెట్టరాదు.
పోలీసు అధికారులపై పర్యవేక్షణ ఉండాలి.
పోలీసు నియమాల సంహితను ఆధునీకరణ చేయాలి.
ఏదో ప్రత్యేక పరిస్థితులలో తప్ప అరెస్టు చేయబడిన స్త్రీలను జామీనుపై విడుదల చేయాలి.

మహిళలను అరెస్టు చేయటంలో, వారిని సోదా చేయటంలో. వారిని ప్రశ్నించడంలో మహిళా పోలీసులే వ్యవహరించాలి.

దాంపత్య సంబంధమయిన నేరాల విషయంగా ప్రత్యేక నైపుణ్యం కల పోలీసు అధికారులే వ్యవహరించాలి.

మహిళాబందీల బంధుగులకు బందీలతో సంప్రదించే అవకాశాలుకల్పించాలి.

మహిళల శ్రేయస్సు ధ్యేయం కావాలి.

ప్రవర్తనా నియమావళిని రూపొందించాలి.

## C) అధికారులపరంగా :

అత్యాచారానికి బలి అయిన స్త్రీని వైద్య పరీక్ష చేసే డాక్టర్లు, శవ పరీక్ష చేసే డాక్టర్లు, రసాయనిక పరీక్ష చేసే నిపుణులు (Chemical Examiners), వేలిముద్రలను తనికీ చేసే నిపుణులు (Finger Print Experts), వైద్యశాలాధికారులు, శరణాలయాల అధికారులు ఇతర సిబ్బంది వీరందరికీ పోలీసులను గురించి చెప్పిన సూచనలే వర్తిస్తాయి. కాకపోతే కొద్దిపాటి మార్పులు ఉంటాయి. స్త్రీల పట్ల జరిగే నేరాలను గురించిన భావనలు, వైఖరులు, దర్యాప్తు సందర్భంగా ప్రేరణలు, ఉద్దేశాలు, ఆలోచనలు అందరికీ ఒకేలాగు ఉండాలి. వీరంతా నిపుణులు కనుక వారికి మానవాళి బాధ్యత యెక్కువ. సమాజం యెడ వీరి బాధ్యత జాస్తి. వారికి వృత్తి విద్య నేర్పించటంలో సమాజం, ప్రభుత్వాలు ఎంతో ధనాన్ని, కాలాన్ని వెచ్చించాయి. వారు తమ మేధస్సును, పాండిత్యాన్ని, నైపుణ్యాన్ని సద్వినియోగం చేసుకోవాలి. తమ చెప్పు చేతలలో ఉన్నవారియెడ అంటే రోగులు, శరణాగతులు తమ పాండిత్య పటిమపై ఆధారపడినవారు వీరందరిమీద శ్రద్ధాగౌరవాలు ఉండాలి. అలాంటి శిక్షణ వారికి ఇవ్వాలి. అంతేకాదు వారిపై పర్యవేక్షణ విధిగా ఉండాలి.

## D) న్యాయస్థానాల పరంగా :

1) న్యాయమూర్తులలో అత్యధిక శాతం పురుషులు. వారికి తెలియకుండానే వారి మనస్సులో పురుష పక్షపాతం పనిచేస్తున్నది. శాసనాలను తయారుచేసేవారు వేరయినా భాష్యం చెప్పేది, ప్రతి కేసుకు న్యాయసూత్రాలను అన్వయం చేసేది న్యాయమూర్తులే కదా। కనుక న్యాయమూర్తుల తాత్విక వైఖరి ప్రముఖపాత్ర వహి

స్తున్నది. వారి మనో వైఖరులు కాలానుగుణంగా మారాలి. పాతకాలపు చాంధస భావాలను విడనాడ కల్గాలి.

2) న్యాయమూర్తులు ఏదో ఒక రాజకీయపార్టీకి, సిద్ధాంతానికి కట్టుబడి ఉండ రాదుకాని ప్రజాస్వామిక మౌలిక సూత్రాలకు కట్టుబడి ఉండటం తప్పుకాదు, భారత రాజ్యాంగపు మౌలిక ఉద్దేశ్యాలకు, మౌలిక హక్కులకు, మార్గదర్శక సూత్రాలకు వారు అంకితం కావాలి. అంటే స్త్రీ పురుష సమానత్వాన్ని వారు అంగీ కరించేవారుగా ఉండాలి.

పోలీసుల పరంగా, అధికారుల పరంగా చెప్పిన సూత్రాలు వారి వృత్తికీ వర్తిస్తాయి. సర్వీసులో ప్రవేశం, శిక్షణ, ప్రవర్తన నియమావళి, పునశ్చరణ తరగ తులు, పర్యవేక్షణ అన్నీ వారికి అనువర్తిస్తాయి.

3) మహిళా న్యాయమూర్తులను అన్ని స్థాయిలలోను ఇతోధికంగా నియమిం చాలి.

4) న్యాయమూర్తులకు సహాయసహకారాలను అందించటానికి ఎక్కువసంఖ్యలో మహిళా న్యాయవాదులను నియమించాలి.

5) ఉచిత న్యాయ సలహాను మహిళా లాయర్లద్వారా ప్రజలకు ముఖ్యంగా స్త్రీలకు అందించాలి.

6) వైవాహిక వ్యవహారాల్లో న్యాయమూర్తులకు ప్రత్యేక శిక్షణ ఇవ్వాలి.

7) కుటుంబ న్యాయస్థానాలను (Family courts) త్వర త్వరగా ఎక్కువ ప్రదేశాలలో నెలకొల్పాలి. ఆ న్యాయస్థానాల్లో మహిళా న్యాయమూర్తులను విధిగా వేయాలి.

8) మహిళలను శిక్షించటంలో, మానసికస్వాస్థ్యం లేనివారిని, పిల్లలుకల స్త్రీలను గురించి ఉత్తర్వులు ఇవ్వడంలో ఎంతో జాగ్రత్త వహించాలి. వైవిధ్యంతో కూడిన వివేకాన్ని న్యాయమూర్తులు ప్రదర్శించాలి.

**E) శాసనపరంగా :**

1) శాసనం అయినా రాజ్యాంగ మౌలిక సూత్రాలకు అనుగుణంగా ఉండాలి. రాజ్యాంగపు మార్గదర్శక సూత్రాలకు అనుగుణంగా ఉండాలి; భిన్నంగా ఉండ రాదు. శాసనం అనేక పనులను చేస్తుంది. ప్రజలకు ప్రబోధం చేస్తుంది. నేరాలు చేయరాదని హెచ్చరిస్తుంది. సంఘ పరిణామానికి దోహదం చేస్తుంది. సామాజిక ప్రయోజనాన్ని సాధిస్తుంది.

2) శాసనం వివక్షను పాటించరాదు.

3) ప్రజలందరికీ న్యాయవ్యవస్థ ఇచ్చే రక్షణ సమంగా ఉండాలి. కాకపోతే బలహీన వర్గాలకు, స్త్రీలకు ఇతోధిక సౌకర్యాలను, రక్షణలను కల్పించవచ్చు.

4) సామాజిక నీతిని అమలు పర్చటానికేకాక సామాజిక విధానానికి భిన్నంగా ప్రవర్తించేవారిని శిక్షించటానికి శాసనం ఉద్దేశించ బడింది.

5) ఈనాడు శాసనాలు రూపొందటంలో లోపాలు దొర్లుతున్నాయి. అసలు స్త్రీలకు సంబంధించిన శాసనాలను ఇంతవరకు పురుషులే తయారుచేశారు. ఇది మహాత్మాగాంధిగారి మాట, వాస్తవం కూడా అదే. స్త్రీలకు సంబంధించిన శాసనాలను న్యాయశాస్త్ర పారంగతులైన మహిళలు రూపొందించటం న్యాయం.

6) శాసనాలను ప్రభుత్వ పత్రికలో (Gazette) వేస్తున్నారు. వాటిని ఎవరూ చూడటంలేదు; చదవటంలేదు. ప్రజలకు శాసనాల ప్రతులను చవకగా అందించ గలగాలి.



7) ప్రజలు కోర్టు వ్యవహారాల్లో చిక్కుకోకుండా ముమ్ముందుగా జాగ్రత్త పడటానికి అనువుగా ఉచిత న్యాయవ్యవస్థను విస్తరింపచేస్తూ శాసనం రావాలి. తక్షణ సహాయాన్ని అందించటానికి గ్రామాలలో వైద్యులను నియమించినట్లు స్త్రీలకు అలాంటి సలహా సహాయాలను అందించటానికి స్త్రీలకు శిక్షణ ఇచ్చి నియమించాలి. ఈ "సగం ప్లీడర్లు" మహిళా ప్రపంచానికి ఎంతో మేలుచేయగలరు. మహిళా సంఘాల కార్యకర్తలను ఈ వ్యవస్థలో ఇముడ్చుకోవచ్చును.



8) ఆరోగ్య వైద్య రంగాలలో వ్యక్తిగత రంగానికి ప్రత్యామ్నాయంగా ప్రభుత్వ ఆసుపత్రులలో వైద్యులున్నట్లు మహిళా న్యాయవాదుల సర్వీసును ఏర్పరచాలి. ఆ వ్యవస్థ నిర్మాణానికి ప్రభుత్వమే పూనుకోవాలి. అవసరమైన ధనాన్ని అందుకు కేటాయిస్తూ శాసనం రావాలి.



9) ఈనాటి శాసనాల సమీక్ష : ఈనాడు అమలులో ఉన్న శాసనాలు న్యాయస్థానం చెల్లదనే వరకు సమాజానికి వర్తిస్తాయి. వాటిని సమీక్షించి ఏఏ రాజ్యాంగ మౌలిక సూత్రాలకు వ్యతిరేకంగా ఉన్నాయో ముఖ్యంగా స్త్రీలపట్ల వివక్షాయుతంగా ఉన్నాయో గమనించి కాలం చెల్లిన వాటిని రద్దుచేయాలి.

10) మార్గదర్శక సూత్రాల కనుగుణంగా, స్త్రీలకు రక్షణ కల్పిస్తూ దశల వారీగా శాసనాలు రావాలి.

11) న్యాయవ్యవస్థలోను, అది పనిచేసే తీరులోను మార్పు రావాలి. ఇపుడు ప్రతి కేసు ఇద్దరు ప్రతిద్వందుల మధ్య జరుగుతూ ఉంది. ఆ పద్ధతి పోవాలి. అలా శాసనం కావాలి.

12) వివహా సూత్రాన్ని స్త్రీలకు అనుకూలంగా "Preferential Discrimination in favour of Women" అమలు జరుపుతూ అన్నింటా స్త్రీలకు సదుపాయాలు కలుగజేయాలి. అవసరమయితే అలాంటి పద్ధతిని చట్టబద్ధం చేసే రాజ్యాంగ సవరణ కూడా తెచ్చి స్త్రీలకు ప్రత్యేక కేటాయింపులు (రిజర్వేషన్లు) విద్య, ఉద్యోగం, శాసనసభలలో కల్పించాలి.

13) ప్రభుత్వాలు రాజకీయ సంకల్పంతో స్త్రీల శ్రేయస్సును, సంక్షేమాన్ని రక్షించాలి. ఉన్న శాసనాలకు అమలు పరచాలి। కొత్తశాసనాలను తయారుచేయాలి.

అత్యాచారాల నివారణకు స్త్రీలు, పురుషులు, సమాజం, అధికారులు, చట్టాలు మహిళా సంఘాలు అన్నీ కలిసి పని చెయ్యాలి. ముఖ్యంగా యువతులు తమ హక్కులను గుర్తించి ధైర్యంగా నిలిచి పోరాడాలి. మేమూ సర్వలక్షణాలు, శక్తి సామర్థ్యాలుగల వ్యక్తులమేనని ముందుగా గుర్తిస్తే తమ్ము తాము రక్షించుకోగలరు. తమ బిడ్డలలో ఆడ,మగ అనే తేడాలు విస్మరించి సమానంగా పెంచాలి. అమ్మాయిలను బాగా చదివించాలి. కరాటేలాంటి విద్యలను నేర్పించాలి.

సమాజము, ముఖ్యంగా పోలీసులు, అత్యాచారాలు, మానభంగాలు, ఈవ్ టీజింగులు జరిపే అబ్బాయిల్ని పట్టుకొని శిక్షించాలి. సమాజం వారిని సాంఘిక బహిష్కరణ చెయ్యాలి. చట్టాలలోని శిక్షలను గట్టిగా అమలు పర్చాలి. పురుషులు అన్య స్త్రీలను తమ చెల్లెళ్లుగాను, కూతుళ్ళగానూ చూడాలి. టి. వి. లు, రేడియోలు, వార్తాపత్రికలు ఈ వార్తలను శీర్షికలతో ప్రచురించి ప్రజాదృష్టికి తేవాలి. అలా సర్వతోముఖంగా సర్వులూ కలిసి పనిచేసిననాడు, స్త్రీలు అగ్రభాగాన నిలిచి పోరాడిననాడు అత్యాచారాలు రూపుమాసిపోగలవు.

# స్త్రీలపై అత్యాచారాలు

## సమాజం వీటి విషయం ఎందుకు పట్టించుకోవాలి?

**ఈనాటి స్థితి :**

రోజు రోజుకూ స్త్రీలపై అత్యాచారాల సంఖ్య పెరుగుతున్నది, భార్యలపై హింస భార్యలను చంపడం, స్త్రీలను లైంగికంగాను ఇతరత్రాను వేధించడం,మాన భంగాలు విపరీతంగా సంభవిస్తున్నాయి. ఒకసారి ఈ దుర్ఘటనను చూచినమనిషి, ఆ వార్త విన్న వ్యక్తి చలించిపోతున్నాడు/ పోతున్నది. రెండవసారి అలా జరిగితే అంతగా దిగ్భ్రాంతి చెందడం లేదు. తరువాత ఇదేదో మామూలు విషయమైనట్లు పట్టించుకోవటం లేదు. ప్రజలలో స్పందన శక్తి నశించి పోతున్నది. ప్రజలు ఉలిక్కి పడటంలేదు. ఆశ్చర్యాన్ని వ్యక్తం చేయడంలేదు. ఆందోళన చెందటం లేదు. అయ్యో పాపం! అని అనటం కూడా మానివేశారు. సాధారణంగా ఇలాంటి సంఘటనను గురించి వింటే బలి అయిపోయిన స్త్రీపట్ల సానుభూతి ఉదయిస్తుంది. అదీ పోయింది. ఎందుకని ప్రజలు ఇలాంటి వైఖరిని ప్రదర్శిస్తున్నారు? దుర్మార్గాలు పెచ్చుపెరుగుతుంటే ఆ వార్తలు వినటం అలవాటయిపోతుంది. చర్మము మందం అవుతుంది. మనిషిలో ప్రకోపన రాదు. "అలాగా" అని ఊరుకోవటం జరుగు తున్నది. రోజూ చచ్చే వాళ్ళను గురించి ఏడ్చేవాళ్లెవరు? ఏడవడం, బాధపడటం తెలివితక్కువతనం అని ప్రజలు భావిస్తున్నారు. కొందరు అలాగని స్పష్టంగా చెప్తారు. మరికొందరు తమ చేతల ద్వారా అదే భావాన్ని వెలువరిస్తారు. అంతే తేనా?

మనిషికి జాలి, సానుభూతి, కోపం వగయిరా ఉద్వేగాలు ఉంటాయి, ఉండాలి కూడాను. తోటివాని యెడ...ఆ మాటకొస్తే పశుపక్ష్యాదుల యెడ కూడా జాలి, దయ, సానుభూతి, కరుణ చూపడం మానవత్వ లక్షణం. అంతేకాదు, అమా నుషంగా ప్రవర్తించిన వ్యక్తిపై కోపం రావడం సహజం. ఈ ఉద్వేగాలను ఒక మనిషి ప్రదర్శించకపోతే అతడు/ఆమె మానవత్వం కోల్పోయినట్లే.

ఇల్లు తగలబడి పోతుందనుకోండి. తోటివారు చూస్తూ ఊరుకోలేరు. కొందరు ముందుకురికి మంటలను ఆర్పటానికి ప్రయత్నిస్తారు. మరికొందరు ఇంటివారిని బయటికి తీసుకొని వస్తారు. ఇంకా కొందరు వారి సామాన్లను బయటికి తెచ్చి సాయ పడతారు. తతిమ్మావారు వారిని ఓదారుస్తారు; ఇతర విధాలుగా ఆదుకుంటారు. ఎందుకని? ఒక వ్యక్తి నీళ్ళలో మునిగిపోతుంటాడు / మునిగిపోతుంటుంది. ఆమె కేకలు విన్న వ్యక్తులు ఊరుకోరు. విన్న వ్యక్తికి ఈత వస్తే వెంటనే మునిగిపోయే

వ్యక్తిని రక్షించటానికి నీళ్ళల్లోకి దూకటం క్షణంలో జరిగిపోతుంది. ఈతరాని వారు ఒడ్డున ఉండి హాహాకారాలు చేస్తుంటారు. కొంతమంది మునిగే వ్యక్తిని రక్షించే నిమిత్తం త్రాడు మొదలయిన పరికరాలను తెస్తారు. ఎందుకని? ప్రాణాలకు తెగించి వారు మరో వ్యక్తిని ఎందుకు రక్షించ పూనుకుంటారు? అది మానవత్వ లక్షణం కనుక; మానవులు సామాజిక జీవులు కనుక. తోటి ప్రాణియెడ సానుభూతి అనేది మానవ నైజంలో భాగం. చూస్తూ ఏ వ్యక్తి ఊరుకోవటం మానవ స్వభావ వ్యతిరేకం.

## స్త్రీల మీద అత్యాచారాలు జరిగితే ఏమి?

1. మానవజాతిలో స్త్రీలు రమారమి సగంమంది ఉన్నారు. అలాంటి స్త్రీల మీద అత్యాచారాలు జరుగుతుంటే ఎలా చూస్తూ మౌనం వహించగలం? స్త్రీలను తగలేసుకుంటూపోతే చివరికి ఏమవుతుంది? జనాభాలో స్త్రీల సంఖ్య తగ్గిపోతుంది. కేవలం స్వార్థబుద్ధితో చూచినా పురుషులకు భార్యలు దొరకరు అన్నీ సాగుతున్న పురుషాధిక్య సమాజంలో పురుషులు అనుభవిస్తున్న వనరులు, సదుపాయాలు సుఖాలు మటుమాయం అవుతాయి. పురుషులు–ఈనాడు ఆశిస్తున్న సమాజం తల్ల క్రిందులవుతుంది.

2. అసలు మరో పద్ధతిలో ఆలోచిస్తే స్త్రీలు ఎవరు? వారు తల్లులు, అక్క చెల్లెళ్ళు, భార్యలు. తల్లిగా పురుషుని పెంచి పోషించేది స్త్రీ. అక్కగా చెల్లిగా అభిమానించేది స్త్రీ. భార్యగా అతనికి సర్వసుఖాలు అందించేది స్త్రీ. అలాంటి స్త్రీని చంపుకునేవాడిని, చంపేవాడిని ఏమనాలి? "ద్విపాద పశువు" అని పేర్కొనాలి. మనిషికి కాళ్ళూ చేతులు మాత్రమే కాదు. మనస్సు ఉంది. బుద్ధి ఉంది. వివేకం ఉంది. వీటిని అతడు/ఆమె వాడాలి కదా!

స్త్రీజాతి పురుషుల దుర్మార్గాన్ని, పురుషాధిక్య సమాజపు విలువలను పుణికి పుచ్చుకున్న స్త్రీల అవివేక ప్రవర్తనను అసహ్యించుకుంటే ఏమి చేయగలదు? భర్తలు పెట్టే బాధలను, అత్త ఆడబిడ్డల ఆరళ్ళను భరించలేక కోడళ్ళు చనిపోతే ఏమవుతుంది? కోడళ్ళను భర్త, అతని తాలూకావారు చంపితే ఏమి సంభవిస్తుంది? కాలం ఎప్పుడూ ఒకలాగా ఉండదు. మారుతుంది. మారక తప్పదు. స్త్రీజాతికి చైతన్యం రాక తప్పదు. పురుషాధిక్య సమాజంపై స్త్రీలకు ఏవగింపు పుడుతుంది. అంతవరకు మంచియే జరుగుతుంది. అలాకాక "సహేంద్ర తక్షకాయ స్వాహా" అంటూ పురుషజాతిపైననే స్త్రీ జాతి ద్వేషం పెంచుకునే స్థితి వస్తే వారు వివాహాన్నే ఈసడి

స్తారు. వివాహ వ్యవస్థ బ్రద్ధలవుతుంది. పురుషులతో సాంగత్యాన్ని, సాహచార్యాన్ని వారు అభిలషించరు. వారిలో వారు వివాహాదులు, స్నేహాలు, సాహచర్యాలు కాపురాలు సాగించే స్థితి వస్తుంది. ఇలా జరుగుతున్నది అమెరికా సంయుక్తరాష్ట్రాలలో. ఇలాంటి ప్రవర్తనకు సిద్ధాంతబలం ఇచ్చారు కొందరు. దానినే "రాడికల్ ఫెమినిజం" ("తీవ్ర స్త్రీవాదం") అని అంటున్నారు. అయితే ఈ సిద్ధాంతాన్ని ఎక్కువమంది స్త్రీలు ఆమోదించటం లేదు ఈనాడు. కాని పురుషులు స్త్రీల మీద అత్యాచారాలు చేస్తుంటే స్త్రీలలో ఇలాంటి మనోభావాలు పెరగడం సహజం. అప్పుడు పురుషులు ఆశించేది జరగదు. వారి పరిస్థితి తారుమారు అవుతుంది.

3. స్త్రీల మనోవైఖరి ఎల్లకాలం ఒకలాగా వుండదు. వారి భావాలు మారతాయి. ఇప్పటికే కొన్ని సామెతలు వాడుకలోకి వచ్చాయి. అవి స్త్రీల భావాలకు ప్రతిబింబాలు. "ఆడదయి పుట్టేదానికన్నా అడవిలో మ్రానై పుట్టటం మేలు" అనేది అలాంటిది. అంటే స్త్రీలు ఆడపిల్లలను కనడానికి విముఖంగా ఉంటున్నారన్న మాట. ఆడపిల్ల పుడితే భర్త చికాకు పట్టాడనే భయం ఒక వైపు భార్యకు ఉందనుకోండి. అంతకన్నా బలవత్తరమయిన భావం స్త్రీలను బాధిస్తున్నది. "నేను ఆడదానినిగా పుట్టి ఏమి బావుకున్నాను? మరో ఆడపిల్లను ఈ ప్రపంచంలోకి తెచ్చి ఆమెకు బాధామయ జీవితాన్ని ఎందుకు ఇవ్వాలి? అసలు ఆడపిల్లను కనకుండా ఉంటే మంచిది కాదా?" ఇలా ఉంటాయి మున్ముందు స్త్రీ యొక్క ఆలోచనలు. అలా ఊహించే స్త్రీ, అలా ఆలోచించే మహిళ ఎలా ఆడపిల్లను కంటుంది? ఎందుకు కనాలి? దాంతో ఆడపిల్లల జననాల రేటు తగ్గిపోతుంది. జనాభాలో స్త్రీల సంఖ్య గణనీయంగా తగ్గిపోతుంది. అప్పుడు మగపిల్లలకు పెళ్ళిళ్లు కావు. వారి గతి వర్ణింపనలవి కాదు.

ఇది ఊహా చిత్రంకాదు. రాబోయే ధోరణులను పసిగట్టడం. ముందు మెలకువతో వ్యవహరించమని పురుషులను హెచ్చరించడం.

4. పురుషులలోని స్వార్థ గుణాన్ని కాసేపు విస్మరించి అసలు ఈ సమస్యను మానవ ప్రవర్తన నైజం దృష్ట్యా పరిశీలిద్దాం.

స్త్రీలు ఎవరు? మనుష్యులే కదా। వారికి మనస్సు, బుద్ధి, వివేకం ఉన్నాయి కదా। వారికి ఆవేశ కావేషాలు ఉన్నాయి కదా। వారిని మనుషులుగా పరిగణించనక్కరలేదా? వారిని వస్తువులు బానిసలుగా, రెండవరకపు వ్యక్తులుగా చూడటం ఏమి న్యాయం? మనుషులు మనుషుల్ని చంపుకునే రోజులను మానవ నాగరికత

అసహ్యించుకోవటం లేదా! మనుష్యులను చంపి ఆహారంగా స్వీకరించే జాతులను అసహ్యించుకోవటం లేదా? బానిస విధానాన్ని నిర్మూలించటానికి మానవ జాతి ఎంతగా కృషి చేసిందో మనకు తెలియదా? అమెరికా సంయుక్త రాష్ట్రాలలో బానిసత్వ పద్ధతిని పోగొట్టే క్రమంలో అంతర్యుద్ధం జరిగిందే! ఒక జాతి మరొక జాతిపై దండెత్తి, లొంగదీసుకొని, వారికి స్వతంత్ర జీవనం లేకుండా చేస్తే ఎన్ని దేశాలతో స్వాతంత్ర్య సముపార్జన కోసం యుద్ధాలు జరిగాయి? వీటన్నింటిలో ఈ పోరాటాల్లో, ఈ యుద్ధాలలో ప్రముఖ పాత్ర వహించిన పురుషులు ఇప్పుడు స్త్రీ జాతిని నీచంగా చూడటంలో ఔచిత్యం ఏమిటి? స్త్రీలను న్యూనతగా చూడటానికి పురుషులకు ఎవరిచ్చారు అధికారం?

ఇలా ప్రశించేటప్పటికి పురుష దురహంకారులు దిక్కుతోచక, దరిగానక వితండ వాదాలకు దిగుతారు. వాటిని గురించి స్థూలంగా ప్రస్తావించటం అవసరం (i) స్త్రీలకు కొన్ని ఇబ్బందులవల్ల వారు పురుషులువ్యవహరించినవిధంగా స్వేచ్ఛగా ప్రవర్తించలేరు. వారికి బహిష్టు, గర్భధారణ, ప్రసవం కొన్ని అనర్హతలకు దారి తీస్తున్నాయి. కనుక వారు పురుషుల కన్నా తక్కువవారు. ఇదీ వాదన. ఈ అంశాన్ని అనేక మతాలు బహిరంగంగా ప్రకటిస్తున్నాయి. దీనిమీదే పురుషాధిక్య సమాజం నిర్మితమయింది. పైన చెప్పినవి స్త్రీలకు సహజ దేహధర్మాలు. వీటిని లోపాలుగా పరిగణించకుండా మంచి లక్షణాలుగా చూడాలి. పురుషులు చేయలేని పనిని స్త్రీ జాతి నిర్వహిస్తున్నది. అది ఆ జాతి గొప్పతనానికి నిదర్శనం. దానిని అలాచూడక దానిని బలహీనతగా భావించడం బుద్ధి పొరపాటు. స్త్రీజాతి సంతానోత్పత్తి కార్యక్రమాన్ని నిలిపి వేస్తే మానవజాతి నశింపక తప్పదు. ఇంత చిన్న విషయాన్ని గుర్తించకపోవడం పురుష దురహంకారుల గ్రుడ్డితనం కాక మరేమీ కాదు. కనుక స్త్రీలు పురుషులకన్నా అధికులు అని గ్రహించాలి.

(ii) స్త్రీలు పురుషులకన్నా బలహీనులు. కనుక స్త్రీలు పురుషులకు లొంగి ఉండాలి; ఈ వాదానికి రెండు అభ్యంతరాలు ఉదయిస్తాయి.

a) అందరు స్త్రీలు అందరు పురుషులకన్నా బలహీనులు కాదు. కష్టజీవుల వర్గానికి చెందిన స్త్రీలు చాలామంది మధ్యతరగతి పురుషులకన్నా బలశాలులనేది అందరికీ తెలిసిన విషయమే.

b) నిజానికి స్త్రీ జాతికి వ్యాధి నిరోధక శక్తి పదిశాతం ఎక్కువ. స్త్రీలు పురుషులకన్న ఎక్కువకాలం జీవిస్తారు అనేది స్పష్టం. కాకపోతే ప్రసవ సందర్భంగా

మరణాలను లెక్కలోకి తీసుకోకూడదు. వైద్య సదుపాయాలు పెరుగుతున్న కొలదీ ప్రసవ సందర్భంగా సరి అయిన సౌకర్యాలు లేక మరణాలు సంభవిస్తున్నాయి. ప్రజలలో ఆరోగాన్ని గురించిన శ్రద్ధ పెరుగుతున్న కొలదీ ఆ బాధలు నివారణ అవుతున్నాయి. ప్రసవ సందర్భంగా ప్రమాదాన్ని తట్టుకోగలిగిన స్త్రీ చాలాకాలం జీవించగలుగుతున్నది.

c) పశుబలాన్ని ఈనాడు లెక్కలోకి తీసుకోకూడదు. ఎక్కడో మీట నొక్కితే వేల మైళ్ళ దూరాన ఉన్న నగరాలను ధ్వంసం చేయగల స్థితి సంభవించిన తరువాత కండబలానికి ప్రాధాన్యత ఏమిటి? బుద్ధిబలం ముఖ్యం. ఆ విషయంలో స్త్రీ పురుషునికి తీసిపోదు. ఆమె అన్ని రంగాలలో రాణించగలదు.

d) దేహబలం విషయంలో పురుషుడే అధికుడని అంగీకరిద్దాం? దాని వలన ఏమి తేలుతుంది. ఆధునిక యుగంలో, పనిముట్ల వాడకం పెరిగిన ఈ కాలంలో దేహబలం సాధించగల్గిందేమిటి? మనిషి కన్న ఎన్నోరెట్లు దేహబలం కల ఏనుగును మనిషి అదుపులోకి తీసుకోవటం లేదా! దేహబలపు ఆధిక్యతను సాకుగా చూపి స్త్రీపై పెత్తనం చేయడం దుర్మార్గం.

e) పూర్వకాలంలో స్త్రీ మెదడు చిన్నదని అందుకని ఆమె పురుషునికన్నా తక్కువ అని వాదించారు. ఆ వాదన ఈనాడు చెల్లదు. మనిషి ఎత్తుకు తగినట్లుగా మెదడు పరిమాణం వుంటుంది. తరతరాలుగా స్త్రీ జాతిని ఇళ్ళల్లో బంధిస్తే వారిని చిన్నతనంలోనే తల్లులను చేస్తే వారి దేహపు పెరుగుదల తగ్గిపోయింది. ఇది సామాజిక జీవిత రీతుల ప్రభావం కాని మరేమీ కాదు.

f) ఇక గత్యంతరం లేక బూతులకు దిగుతారు పురుష దురహంకారులు. లైంగికంగా పురుషునికి చైతన్యం వుంది స్త్రీకి లేదు. స్త్రీ అవయవ నిర్మాణం అలా నిర్దేశించింది. స్త్రీ మర్మావయవం ఆమె దేహంలో ఉంటున్నది. పురుషుని మర్మావయవం అతని దేహానికి వెలుపలి భాగంలో ఉంటున్నది. అందుచేత లైంగిక సంపర్కం విషయంలో అతనికి స్వాతంత్రత ఉంది. కనుక పురుషుడు గొప్ప. శరీరశాస్త్రం బాగా తెలియని రోజుల్లో కల్గిన ఊహలు ఇవి. జ్ఞానం వృద్ధి అయింది. లైంగిక తృప్తి ఎలా కలుగుతుందో తెలిసిపోయింది. పురుషుని సహాయం లేకున్నా స్త్రీ లైంగికతృప్తిని పొందగల స్థితి సంభవించింది. అలాంటి అవకాశం ఆమెకు లభిస్తున్నది. స్త్రీ అవయవంలోనే అలాంటి తృప్తిని ప్రసాదించగల భాగంయొక్క ప్రాముఖ్యాన్ని గుర్తించటం జరిగింది. అదే "క్లిటోరిస్" (CLITORIS -యోని తొడిమ). దీంతో పురుషుని అహంకారం

ప్రాపంచలవుతుంది. స్త్రీ పురుష సంపర్కం లేకుండా స్త్రీ తల్లి కావటానికి అవకాశాలు వచ్చాయి. మార్కెట్‌లో ఇంద్రియసేకరణ కేంద్రాలలో (Sperm Banks) శుక్లాన్ని ఆమె కొనుగోలు చేయగల స్థితి వచ్చింది. అహంకారాన్ని పురుషుడు ప్రదర్శిస్తే చివరకు అతనికి ఒంటరితనమే గతి అవుతుంది.

దీనివల్ల ఏమి తేలింది? పురుషాధిక్య భావన కేవలం సహజ నిర్మితమే కాని ఇతరత్రా కారణాలవల్ల ఏర్పడిందికాదు. ఇలా పురుషాధిక్య భావనకు అడుగు ఊడుతున్నది కనుక స్త్రీలమీద అత్యాచారాలకు పురుషులు పూనుకోరాదని తేలుతున్నది.

## అత్యాచారాలవల్ల కలిగే దుష్ఫలితాలు ?

సిద్ధాంతరీత్యా స్త్రీలమీద అత్యాచారాలు ఎందుకు జరుగరాదో నిర్ధారించిన తరువాత అటాంటి అత్యాచారాలవల్ల కలిగే కష్టనష్టాలను గురించి తెలుసుకుందాం.

### 1) భార్యలపై హింస, వారిని చంపడం :

భార్య అంటే భరింపబడేది. భర్త అంటే భరించేవాడు. ఈ ఉత్పత్తి అర్థాలకు ఇపుడు సార్థకత లేదు. కష్టజీవుల కుటుంబాల్లో, కొన్ని మధ్యతరగతి కుటుంబాల్లో స్త్రీలు సంపాదిస్తున్నారు. ఆ మాటకు వస్తే స్త్రీల సంపాదన మీద మాత్రమే సాగే కుటుంబాలు ఉంటున్నాయి. అనేక మధ్యతరగతి కుటుంబాల్లో స్త్రీలు గృహ నిర్వహణ చేస్తున్నారు. అది పనికాదా? అయితే కనుపించని. పని పురుషుని దృష్టిలో అది లెక్కకు రాదు. నిజానికి అది ఆమెకు రోజుకు 24 గంటలు ఆదుర్దాను కలిగించే పని. పోనీ, ఆ పనికి ఇతరులను నియమించి, వారికి జీతాలు ఇమ్మని పురుషుడిని ఆదేశిస్తే అతని జీతపురాళ్ళు ఆ వేతనాల చెల్లింపుకు చాలవు. ఇదంతా జమకడ్తే ఆమె సంపాదన క్రింద లెక్కకురాదా? ఇక ధనవంతుల గృహాల్లో చాలామంది స్త్రీలకు ఆస్తులుంటాయి. అవి వారికి ఆదాయాన్ని సమకూరుస్తాయి. ఇక సమాజంలో ఏ వర్గంలోనయినా స్త్రీలు పరాన్నభుక్కులుగా, పురుషుల మీద ఆధారపడి బ్రతుకుతున్న దెక్కడ ?

భార్యాభర్తలు కలసి కాపురం చేస్తుంటారు. వారిద్దరి మధ్య ఉండవలసినవి ఒకరిని గురించి మరొకరు శ్రద్ధవహించడం, ఒకరు మరొకరితో జీవితంలో కష్టసుఖాలను పంచుకోవటం, కుటుంబాన్ని సుఖప్రదం చేసుకోవటం. ఈ లక్ష్యాలు నెరవేరాలంటే ఇద్దరిమధ్యా సహకారం కావాలి. ఒకరిపై మరొకరికి ప్రేమాభిమానాలు, గౌరవభావం ఉండాల్సిన అవసరం ఉంది. అంతేకాదు. ఒకరికోసంమరొకరు త్యాగం చేయాల్సిన అగత్యం ఉంది. ఒకరి అవసరాలను మరొకరు గుర్తించాలి

దానికనుగుణమైన ప్రవర్తనను అలవర్చుకోవాలి. అప్పుడే వారు సన్నిహితులు కాగల్గుతారు. అయితే అనేక కుటుంబాలలో ఇలా జరగటంలేదు.

**కారణాలు :** 1) దేశంలో అక్షరాశ్యుల సంఖ్య నూటికి నలుబది. అదయినా అతి కష్టంమీద దస్కతు పెట్టగలవారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో స్త్రీలలో అక్షరాస్యుల శాతం 18. ముస్లిం స్త్రీలలో 103 మించదు. కొండజాతులలో 5 శాతం మాత్రమే. ఇలాంటి పరిస్థితుల్లో స్త్రీ పురుషులలో అందులో ముఖ్యంగా స్త్రీలలో అజ్ఞానం హెచ్చుగా ఉండటం ఆశ్చర్యం కాదు.

2) స్త్రీ తన వస్తువు అని లేక స్త్రీ తన బానిసఅని, స్త్రీ తనకన్నా తక్కువ స్థాయికల వ్యక్తి అని భావించే పురుషుల సంఖ్య ఎక్కువగా ఉండటం.

3) తనకన్నా తక్కువ కనుక ఆమెను వివాహమాడినందుకు అతడు వర కట్నాన్ని అడిగి పుచ్చుకుంటున్నాడు. అదిగాక బంధనాలు, వస్తువులు పీటిని అద నంగా కోరుకుంటున్నాడు. దబాయించి అడుగుతున్నాడు. ఇవ్వకపోతే భార్యను హింసించటం, చంపటం జరుగుతున్నది.

4) స్త్రీలను పురుషులు కేవలం భోగ్యవస్తువులుగా పరిగణించటం. పురుషుడు ఎప్పుడు కోరితే అపుడు ఆమె అతని కోర్కెను తీర్చాలిట. లేకపోతే తగాదా, కొట్లాట, హింస ప్రారంభం అవుతాయి.

5) స్త్రీలను కేవలం సంతానం కనే యంత్రాలుగా భావించడం, భర్త ఎంత మంది సంతానాన్ని కనమంటే అంతమందిని కనాలట. భర్త మగశిశువు కావాలంటే మగశిశువు కలిగే వరకూ ఆమె ఆడశిశువులను కనాల్సిందేనట. గర్భస్రావం చేయిం చుకోమని భర్త ఆజ్ఞాపిస్తే భార్య శిరసావహించాలట. లేకపోతే చంపివేస్తాడు. మగ శిశువయినా, ఆడపిల్ల అయినా ఆమెకు కల్గడానికి తనదే బాధ్యతయని పురుషుడు ఆలోచించడు. ఎంత అజ్ఞానం! ఎంత మూర్ఖం.

ఇలా భార్యలను హింసిస్తే భార్యాభర్తల మధ్య సహకారం నశిస్తుంది. ప్రేమానురాగాలు చిదిమిపోతాయి. సంసారం దుఃఖభాజనం అవుతుంది. భార్యను చంపితే పెళ్ళాన్ని చంపిన భ్రష్టుడు అని నిందకు లోనవుతాడు భర్త. పిల్లలు తల్లిలేని వారవుతారు. తల్లిప్రేమ కరువయి వారు దురలవాట్లకు లోనవుతారు. చివ రకు చెడిపోతారు. ప్రభుత్వం కేసుపెడితే తను జైలు పాలవుతాడు. ఈలోగా కుటుంబం చితికిపోతుంది. ఇన్ని అనర్థాలు సంభవిస్తాయి. అంతే కాదు. అతడు మరల వివాహమాడ తలిస్తే పిల్లను ఇవ్వడానికి మర్యాదస్తులు సంకోచిస్తారు

ఎలాగో అలాగు పెండ్లాడగల్గినా అనుకూలవతియైన భార్య దొరకక అతని నెత్తిన తాండవమాడే వ్యక్తి తటస్థిస్తుంది. దాంతో సంసారం నరకం అవుతుంది.

**స్త్రీలను వేధించటం :**

స్త్రీలను వేధించటం రెండు రకాలు 1) వారిని లైంగికంగా వేధించటం 2) విపరీతంగా అపహాస్యానికి గురిచేసి బాధించటం

**లైంగిక వేధింపు :** ఉద్యోగినులను, కర్మాగారాల్లో పనిచేసే కార్మిక స్త్రీలను పై అధికారులు, తోటి పురుష ఉద్యోగులు, పురుష కార్మికులు వేధిస్తారు, బాధిస్తారు. వారిని కోరరాని కోర్కెలను కోరడం, ఒరుసుకొని తిరగడం అలాంటివి. కొన్ని కళాశాలలలో కొంతమంది పురుష అధ్యాపకులు విద్యార్థినులను ప్రత్యేకంగా బోధన సాగిస్తామని చెప్పి, ఇళ్ళకు పిలిపించుకొని, వారిని లైంగికంగా అవమానాల పాలు చేయటం అప్పుడప్పుడు జరుగుతున్నది. ఇలాకాక జనసమ్మర్దమున్న ప్రదేశాలలో, బస్సులలో వారి శరీరాలను తాకడం, ఒత్తిడి కలుగజేయడం సాధారణంగా జరుగుతున్నది. ఈ దుర్మార్గ ప్రవృత్తి కేవలం సంఘ వ్యతిరేక శక్తులకు చెందిన యువకులే కాక వయస్సు మళ్ళినవారిలో కూడా కనిపిస్తున్నది. ఇలాంటి అవమానాలను భరించలేక ఒక విద్యార్థిని ఆత్మహత్య చేసుకుంది.

ఎక్కువగా విద్యారంగంలో పాఠశాలల్లో, కళాశాలలో పురుష విద్యార్థులు విద్యార్థినులను గేలిచేయటం జరుగుతున్నది. కాస్త హాస్యం క్షంతవ్యం కావచ్చును. కాని అపహాస్యం మోతాదు మించితే ఘోరంగా పరిణమిస్తుంది. ఈ వేధింపు కార్యక్రమాలవల్ల స్త్రీలకు ఆత్మస్థయిర్యం నశిస్తుంది. మానసికంగా క్రుంగిపోతారు. వారిలో పూనిక, చొరవ నశిస్తాయి. తమ శీలానికి దెబ్బతగిలిందని అపోహపడి ప్రాణత్యాగానికి కూడా పాల్పడటం కద్దు, విపరీతమైె అపహాస్యం వల్ల దానికి బలియైన స్త్రీలలో న్యూనతా భావం ప్రవేశించే ప్రమాదం ఉంది. కుమిలి కుమిలి బాధపడటం అలవాటుగా మారుతుంది. సంతోషానికి ఆమె దూరం అవుతుంది. తనకు మంచి వివాహ సంబంధం రాదేమోనని ఆమెకు దిగులు పట్టుకుంటుంది, భయం ఆమెను ఆవరిస్తుంది.

**మానభంగాలు :**

ఇటీవల ఇవి పెరుగుతున్నాయి. ఎక్కువగా పేదవర్గాల స్త్రీలు ఈ అకృత్యాలకు బలి అవుతున్నారు. పురుషుడు ఎందుకు ఈ దుర్మార్గానికి పూనుకుంటున్నాడు? దీనికి అనేక కారణాలను పేర్కొనవచ్చు. ఇందులో ఏదో ఒక కారణం ఉన్నా చాలు. ఈ అత్యాచారం జరిగిపోతుంది.

1) కొందరు పురుషులలో అది ఒక మానసిక జాడ్యం. ఇతరులను బాధ పెట్టే మనస్తత్వం (Sadism). అవతల ఈ దుర్మార్గానికి బలిఅయ్యే స్త్రీ విల విల లాడుతుంటే, తన్నుకుంటుంటే, బాధపడుతుంటే చూచి ఆనందించే మనస్తత్వంఅది.

2) తనకు పరాయి మగవానితో విరోధం, శత్రుత్వం కనుక, అతనిని సాధించాలంటే అతని వస్తువయిన అతని భార్యను, అక్కను, చెల్లెలిని, తల్లిని చెరచి తృప్తిపడటం ఇది దుష్కృత్యాన్ని ఆచరించే మనిషి మనస్తత్వం. ఇది పసి పిల్లవాని మనస్తత్వం. అవతల పిల్లవాని బొమ్మలను పగులగొట్టటం, విరుగగొట్టటం ఆ కోవ క్రిందికి వస్తుంది. శత్రువు యొక్క కుటుంబ స్త్రీలు శత్రువు వస్తు సామాగ్రితో సమానం ఆ దుర్మార్గుని దృష్టిలో.

3) ప్రేమలో విఫలుడయితే ఆ స్త్రీ తనను నిరాకరించినందుకు శిక్షగా ఒకానొక పురుషుడు మానభంగం చేసి కసి తీర్చుకుంటాడు.

4) ఎవరో స్త్రీ తన కోరికను మన్నించకపోతే ఆ కోపాన్ని స్త్రీజాతి మొత్తం మీదకు మళ్ళించుకొని, ఆ స్త్రీజాతిలో ఒకరయిన ఏదో ఒక స్త్రీమీద అత్యాచారం చేస్తాడు. విశేషంగా రక్షణలేని ఆడపిల్లలను, యువతులను బలి పశువులుగా ఎంపిక చేస్తాడు.

5) ఒక స్త్రీతో శత్రుత్వం ఉంటే ఆ స్త్రీని మానభంగం చేసి కసి తీర్చు కోవటం కద్దు.

6) లైంగికంగా తృప్తిపొందే అవకాశంలేని పురుషులు తమకు తటస్థించిన పసిపాపపైననో, బాలికపైననో, అనాథ పైననో అత్యాచారం సాగిస్తారు. ఆమెను మానభంగం చేస్తారు. వారికి లైంగికానందమేమిటో, దానిని ఎలా పొందాలో తెలి యదు, కనుక ఈ పైశాచిక చర్యకు పూనుకుంటారు.

7) మత్తు పదార్థాల ప్రభావం క్రింద నుండే పురుషులు తాము ఏం చేస్తు న్నారో తమకే తెలియక ఈ దుర్మార్గాలకు ఒడికడతారు.

8) స్త్రీలను శిక్షించడానికి మానభంగాన్ని మార్గంగా ఎన్నుకుంటారు కొందరు కుసంస్కారులయిన స్త్రీ పురుషులు. అంతకన్నా మెరుగయిన విధానం వారికి తోచదు.

ఇలా పురుషుడు మానభంగానికి పూనుకోవటానికి అనేక ప్రోత్సాహక మనస్తత్వాలు, ప్రేరణలు కారణభూతమవుతాయి. మానభంగాలకు గురి అయిన స్త్రీలకు న్యూనతాభావం ఆవరిస్తుంది. తమను "ఏదో చెడిపోయినవారినిగా" భావి స్తారు. ప్రాణ త్యాగానికి పూనుకోవడం పరిపాటి. నిజానికి వారిది ఏ తప్పూ లేదు కదా! అయినా లోకం వారిని చిన్నచూపు చూస్తుంది. వారి జీవితాలు అయోమయ ముగా తయారవుతాయి; వారి కుటుంబాలకు లేని మచ్చను ఆపాదిస్తుంది లోకం. అలాంటి స్త్రీలను వివాహమాడటానికి పురుషులు ముందుకు రారు. దుర్మార్గాలను చేసిన పురుషులకు కారగారవాస ప్రాప్తి లభిస్తుంది. ఇలా ఎన్నో బాధలు, వ్యథలు.

## అందరు పురుషులూ అత్యాచారాలు చేస్తున్నారా?

ఇదంతా చదివి కొంతమంది "మీ మాటలు అందరికీ వర్తించవు" అని అంటారు. నిజమే. పురుషులందరూ దుర్మార్గులు కారు. అయితే ఎందుకీ గోల? ఎందుకీ ఆందోళన?

చాలామంది పురుషులు స్త్రీల యెడ జరిగే అత్యాచారాలను పట్టించుకోవడం లేదు. ఇది పరోక్షంగా అత్యాచారాలను ప్రోత్సహించటం క్రిందనే జమ.

చాలామంది పురుషులు మానసిక హింసను లెక్కలోకి తీసుకోవటం లేదు. భార్యను నసపెట్టటం, సూటిపోటీగా మాట్లాడటం, చీటికి మాటికి కోపగించటం ఇలాంటివి హింస క్రిందకే వస్తాయి. వీటిద్వారా స్త్రీకి మానసిక బాధ విపరీతంగా కలుగుతుంది. అడపా దడపా, అప్పుడప్పుడు ఇలాంటి సంఘటనలు బాధించవు. కాని అదే పనిగా అవి జరిగితే అవి అత్యాచారంగా పరిణమిస్తాయి.

## ఈ అత్యాచారాల వల్ల వ్యక్తులకే కదా నష్టం?

స్త్రీలపై అత్యాచారాల వల్ల వ్యక్తులు బాధపడతారు. సమాజం నష్టపోతుంది. వ్యక్తుల కలయిక వల్లనే సమాజం ఏర్పడుతుంది. సమాజంలో భాగస్వాములే వ్యక్తులు కనుక వ్యక్తులు వినా సమాజంలేదు. సమాజం లేకుండా వ్యక్తి సంక్షేమం ఒనగూడదు. కనుక వ్యక్తులకు లేక వ్యక్తుల సముదాయాలకు నష్టకష్టాలు సంభవిస్తే సమాజానికి నష్టం జరిగినట్లే.

సమాజంలో ఘోరాలు జరుగుతుంటే చూస్తూ పూరుకుంటే ఆ విషజాడ్యం సమాజం మొత్తానికి ప్రాకుతుంది. సమాజం విషగ్రస్తమవుతుంది. ఈ తరమే కాకుండా భవిష్యత్ తరాలు కూడా దెబ్బతింటాయి. కనుక ఈ అత్యాచారాలను అరికట్టటం అవశ్య కర్తవ్యం.

## మనం ఏమి చేయాలి?

స్త్రీలపై అత్యాచారాల వలన స్త్రీలకే కాక సమాజానికి కూడా నష్టదాయక మని తెలిసిన, తరువాత, సమాజం ఈ విషయాన్ని పట్టించుకోడానికి నిశ్చయించిన తరువాత వ్యక్తులు, సమాజాలు అత్యాచారాల విషయమై వార్త రాగానే ఏమిచేయాలి ఎవరెవరిని కలుపుకొని పనిచేయాలి, అత్యాచారాలకు బలియైన స్త్రీలకు ఎలాంటి సహాయం చేయాలి అంతటితో ఆగక ముమ్ముందు ఇలాంటి దుర్ఘటనలు జరుగ కుండా జాగృతి చైతన్యం కల మహిళలు, మహిళా సమాజాలు, ప్రభుత్వసంస్థలు, స్వచ్ఛంధ సంస్థలూ ఎలాంటి చర్యలను చేపట్టాలి అనే విషయాన్ని వేరే మరో పుస్తకంలో చర్చిద్దాం. "భార్యలను తగలేయటం, స్త్రీలను వేధించటం" అనే పేరు గల గ్రంథంలో ఆ విషయాలు కూలంకషంగా వివరించబడ్డాయి.

ఈ చిన్న పొత్తాన్ని, పైన ఉదహరించిన గ్రంధాన్ని రెంటిని చదివితే సమస్య మొత్తం అవగతమవుతుంది. ఉదాసీన వైఖరి మానివేసి కార్యాచరణకు గడంగుతాము.